JAGATI Rs. 2-00 September 1989

34th Year of Publication




# స్వాతంత్ర్య దినోత్సవ సంచిక – 1989

## సాహితీ సుధ

జానుగ భూతికిం దొడవు సజ్జనభావము శౌర్యలక్ష్మికిన్
మౌనము నీతి విద్యకు శమంబు సుబుద్ధికి విత్తవృద్ధికి
దానము దాల్మి శక్తికిని ధర్మ నిరూఢి కదంభ వృత్తియుం
బూనిక తోడ సర్వగుణ భూషణ మెన్నగ శీలమే సుమీ

—భర్తృహరి

హేమాచలము శృంగ మెక్కి తెక్కార్చుచు, గాక కూయగనే పికంబు గాదు
గంగాది నదులలో గలయ ముంచంగనే, తలవెంట్రు కెన్నడు దర్భ గాదు
తెగ దిని తలపిక్క లెగయగా బలిసిన, దున్నపో తేనుగ గున్న గాదు
పొదుగు లావై యెంత పొడుగునా బెరిగిన, గుక్కపో తెన్నడు గోవు కాదు
ఉన్నత స్థానమందు గూర్చుండ గానె, భ్రష్టు భ్రష్టే యగుగాని శిష్టు గాడు
మదరిపువిఫాల మునిజన హృదయలోల, వేణుగోపాల భక్తసంత్రాణశీల

—వేణుగోపాల శతకం

'జగతి' – 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600004
ఫోన్ : 76697- చందా 2 సం॥లకు రు. 45-00 – 5 సం॥లకు రు 100-00. జీవిత
చందా రు. 300–00. పాట్రన్ - రు. 1000-00. విదేశాలకు 2 సం॥లకు రు. 100-00

ముఖచిత్రం : రాధాకృష్ణన్

# పాఠకుల తీర్పు

శ్రీయుత చందూర్ గార్కి ; నమస్కారములు. నా మనసుని ఆకర్షించిన పత్రికలలో మొదటిస్థానం మన పత్రికదే! 'నిమ్మతొనలు' పుల్లపుల్లగా, తియ్య తియ్యగా రంజింప జేస్తున్నా యంటే నమ్మండి. 'పాఠకుల తీర్పు' ద్వారా వివిధ వర్గాల పాఠకుల మనోభిప్రాయాలు తెలుసుకోగలుగు తున్నాము.

—సి హనుమంతరావు
చింతలూరు

సంపాదకులకు నమస్కారం. మహిళా జనోద్ధారకులుగ, మానవతా వాదిగ, సాహిత్య కళాపోషకులుగ, 'గృహలక్ష్మి' పత్రిక స్థాపకులుగ సంపాదకులుగ, దాతగా, కేసరి విద్యా లయ స్థాపకులుగ, విఖ్యాతులైన డాక్టర్ కెయస్ కేసరిగారి 'నా చిన్ననాటి ముచ్చట్లు' ధారావాహికంగా ప్రచురి స్తున్న మిమ్ము అభినందిస్తున్నాను.

—జ్ఞానమద్ది హనుమచ్ఛాస్త్రి
కడప-4

చందూర్ గారికి : నమస్కారములు. రామాయణ ఘట్టాల గురించి రఘుకి కలిగే సందేహముల వంటివే మా అబ్బాయికి కూడా కలుగుతూంటాయి. నేను చెప్పే సంజాయిషీ వాడికి నచ్చదు. కాని, 'సధర్మ స్వారాజ్య' పేరుతో మీరు వేస్తున్నవి వాడికి బావుంటున్నాయట. తెలుగు తెలియని మా పక్కింటివారు కూడా "ఈ నెల 'జ గ తి' వచ్చిందా ?" అని ఆ ఒక్క ఇంగ్లీషు పేజీకోసము నన్ను అడుగుతూ వుంటే సర్‌ప్రయిజింగ్‌గా ఉంటుంది. మీ దంపతుల సారస్వత కృషికి మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను.

—కె పార్వతి
పూనె-4

చందూర్‌గార్లకు నమస్కారములు. హైద్రాబాద్ నుండి ఇటీవల మాసోదరి చాలకాలం తర్వాత పుట్టింటికి, అనగా తలగడదీవిలో, మా యింటికి వచ్చింది. స్వయానా పినతండ్రి కుమార్తె. మా బంధువులలో అందరి కన్నా, నాకూ ఆమెకూ సాహిత్య పరంగా అనుబంధం ఎక్కువ .... చదువుకొనేందుకు ఏవైనా పుస్తకాలు కావాలంటే, ఇతర పుస్తకాలతోబాటు నెలవారీ అందే 'జ గ తు లు' ఇచ్చాను. 'నీకెలా వస్తున్నాయి ?' అని అడుగగా, లోగడ నా గురించి మీరు వ్రాసిన కథనం చూపించాను. ఆమె ఆశ్చర్య పోయింది, ఆనందించింది. 'నీకంటె చాలా సంవత్సరాలు ముందుగా తెలుసు నాకు వారిద్దరూ' అన్నదామె సంతోషంతో ! ఆమె ఎవరో కాదు - శ్రీమతి లీలా సుధాకర్.

—మండల రామారావు
తలగడదీవి

## 1776 జులై - ఆ నాలుగు రోజులు

# స్వాతంత్ర్య పత్రం

అమెరికాలోని పదమూడు వలస రాష్ట్రాలు, బ్రిటన్‌నుంచి విముక్తి పొందాలనే సంకల్పంతో ఉన్నాయి - స్వాతంత్ర్య పత్రాన్ని ప్రకటించాయి. అదే యుద్ధ శంఖారావంగా భావించి, తిరుగుబాటుదారులని బలప్రదర్శనతో లొంగదీసుకోవాలనే వ్యర్థ ప్రయత్నంలో ఉంది బ్రిటన్.... ఇక చదవండి

రెండవ పేరా, మూడవ పేరా దగ్గిర కొచ్చేసరికీ, తమకు జరుగుతున్న అన్యాయాలు ఒక్కొక్కటి వివరించ బడుతున్నాయి. వంద సంవత్సరాలక్రితం ఆంగ్ల ప్రభుత్వము అమెరికన్ ప్రజలకిచ్చిన హామీ పత్రాలను ఈ బ్రిటిష్ రాజు చించివేశాడు.

"ప్రతినిధుల సమావేశాలని పదే పదే రద్దు చేస్తున్నాడు. రాష్ట్ర అసెంబ్లీలను రాజవిద్రోహకరములని ప్రకటిస్తున్నాడు. తమ ప్రజల హక్కులను కాపాడటం కోసమై ఏర్పడ్డ ప్రతినిధుల సభలను, అతను అణచివేసి, ప్రజావాణి వినపడకుండా చేస్తున్నాడు. ఈ కారణాల ఫలితముగా ఇప్పుడీ దేశము బయట దేశాల శత్రుప్రమాదానికీ, అంతఃకలహాలకీ స్థావరమవు తున్నది. ఈ అరాచకత్వానికి కారకులు, బాధ్యులు ఆంగ్ల పాలకులు.

"నూతన ప్రపంచపు వలసల నుంచి ఎంత ఆదాయము రాబట్టడానికి వీలో అన్ని రకాలైన అక్రమమైన పన్నులు విధించి ప్రజలను పీడిస్తున్నారు. ప్రజలు అసమ్మతి తెలియబరిస్తే, ఆయా రేవుపట్నాలని మూసివేసి వర్తకవ్యాపారాలు దిగ్బంధం చేస్తున్నారు. తమకు ఎంత మాత్రము ప్రాతినిధ్యములేని ఈ ప్రభుత్వము వేసే పన్నుల భారము ప్రజలు మోయలేకుండా వున్నారు. ప్రాతినిధ్యంలేదు గనక తమ కష్టాలను వినేవారూ లేరు. చెప్పుకొనే అవకాశమూ లేదు."

స్టాంప్ చట్టము ఉపసంహరణకు శతవిధాల ప్రయత్నించాడు డాక్టర్ ఫ్రాంక్లిన్ పది సంవత్సరాల క్రితము. అతను వలసల ప్రతినిధిగా లండన్‌లో వుండడముచేత అక్కడివారు చాలా మంది అతనికి తెలుసు. వార్తా పత్రికలకు లేఖలు వ్రాశాడు. అధికారంలో వున్నవారికి ఈ అన్యాయము వివరించి చెప్పాడు. సభలు సమావేశాల్లో పాల్గొని ఓడ కంపెనీలకు ఎగుమతిదారులకు, ఇందులోని అన్యాయము వివరించి చెప్పాడు. స్టాంప్ చట్టముపట్ల వలసలవారే గాక బ్రిటిష్ వర్తకులు కూడా అసమ్మతి తెలిపారు.

రాజు, అతని పిడికిట్లో వున్న పార్ల మెంటు మాత్రం, ఈ విన్నపాలను లక్ష్యపెట్టలేదు. బ్రిటన్ చేసిన అన్యాయాలు అద్దంలో ప్రతిబింబించిన విధముగా కార్యదర్శి థామ్సన్ చదువుతున్న పత్రములో కాన వచ్చాయి. "ఎన్నో నూతన కార్యాలయాలు తెరచి, ప్రజలను బాధించేందుకూ వేధించేందుకూ అసంఖ్యాకంగా రాజోద్యోగులని పంపుతున్నారు. ఆంగ్ల సేనలకు పాత్రసామగ్రి, పడకబట్టలు, వంట చెరుకూ మొదలైనవి అంద జేయవలసిన తాకిడీ న్యూ ఇంగ్లండు ప్రజలు యింకా మర్చిపోలేదు.

"ఆంగ్లరాజు ఎంతకీ తన సైనిక బలము మీదనే తప్ప ప్రజాభిమతము మీదగాని ప్రజాభిప్రాయము పట్లగాని శ్రద్ధ చూపటము లేదు. ప్రపంచము లోని ఇతర దేశాలలో అమెరికా ప్రజలకు గల వ్యాపారాన్ని తుంచి వేశాడు. జూరీ నిర్ణయము ద్వారా తీర్పు చెప్పాలనే న్యాయశాస్త్ర ప్రథమ సూత్రాన్ని అనేకసార్లు వుల్లంఘిం చాడు. మాలో కొందరిని అతి చిన్న నేరానికి దేశాంతవాసులని చేస్తున్నాడు. మా ప్రజలనుంచి మమ్మ దూరము చేస్తున్నాడు."

మూడవజార్జి ఒక తప్పిదమునుంచి మరొక తప్పిదానికి జారిపోతూ అవకతవకలతో కూడిన రాజ్యపాలన సాగిస్తున్నాడు. వలసప్రజ చాలాకాలం ఈ దుష్కృత్యాలని భరించారు. కాని తమను నల్లినిరాచినట్లు రాయగా వారి లోని నిద్రాణశక్తులు ఎదురు తిరిగి విజృంభించాయి. "ఖైదీలుగా చిక్కిన అమెరికనులను, తమ స్వదేశ సేనలపై సోదరులపై పేల్చమని శాసించారు"

బ్రిటిష్ పార్లమెంటు సభ్యులు కూడా యిది 'కిరాతకచర్య' ఖండించాడు రిచ్ మండ్ ప్రభువు తీవ్ర అసమ్మతి తెలి పాడు "వారిని తమ రక్తసంబంధీ కులపై యుద్ధము చేయమంటున్నారు. అందుకుఅంగికరించకపోతేరాజద్రోహా నికి గాను కాల్చివేస్తామంటున్నారు. దేశద్రోహానికా, రాజద్రోహానికా ఏద్రో హానికి వొడిగట్టాలి వారు? కార్యదర్శి థామ్సన్ తన చేతిలో వున్న పత్రాన్ని ఇంకా చదువుతున్నాడు. ఎదుటనున్న ప్రతినిధులు ఏకమనస్కులై ఎంతో శ్రద్ధగా వింటున్నారు. ఈ ప్రతినిధుల వెనుక మరొక ప్రేక్షక సమూహ మున్నది. నోరులేని, ఈ భవనాలకు రాలేని, నీడలవలె తచ్చాడే అసంఖ్యాక ప్రజానీకము ; పల్లియులు, పట్న వాసులు, శ్రామికులు, వ్యాపారులు, వణిజులు, హస్తనిపుణులు, యంత్ర నిపుణులు ఇలా కొన్ని వేలూ లక్షలూ కుటుంబాలు, ఈ రంగభూమిని తమ మనోవాటికలో వీక్షిస్తున్నారు.

మూడవ జార్జిపై గల చివరి అభి యోగము, నీగ్రో ప్రజలని నిరంతర బానిసత్వంలో వుంచుతున్నాడన్నది. మనుషులను జంతువులను పట్టినట్లు పట్టి బానిసలుగా బంధించి వారిని మరొక ఖండంలో అమ్ముతూండడము సభ్యమానవాళి ఎన్నిటికీ హర్షించ లేదనగా, దక్షిణవలసల ప్రతినిధులు

ఒకరినొకరు క్రీగంట చూసుకొన్నారు. బానిస వ్యాపారం నిర్మూలించమని వర్జీనియా రాష్ట్రం నుంచి ఎన్నో విన్నపాలు పంపబడ్డాయి. రాజుగారు వాటిని విస్మరించారు : లేదా వాటిని త్రోసిపుచ్చారు. ఇప్పుడు ఆ ప్రజలనే తమపై యుద్ధము ప్రకటించమంటున్నాడు. ఎవరి స్వాతంత్ర్యాన్నయితే హరించాడో, వారికి స్వాతంత్ర్యాన్ని యిస్తానని ఆశపెడుతూ, తమపై యుద్ధానికి పురిగొల్పుతున్నాడు. ఈ చేష్టలలో ఒకతీరూ క్రమతాలేవు.

దక్షిణ వలసలలో రెండుతప్ప మిగతావన్నీ బానిసత్వానికి వ్యతిరేకమే. "బానిసవ్యాపారానికి మూడో జార్జిపై నెపం వేయడం న్యాయమా? ఇది అతను పుట్టక పూర్వమునుంచీ వున్నది గదా" అన్నాడు రివరెండ్ విదర్స్పూన్. ఇప్పటికి వంద సంవత్సరాలబట్టీ అంగ్లేయులు, ఇతర సాహసికులు ఆఫ్రికా తీరాన గల నల్లజాతులవారిని వేటాడి, వారిని అమ్మజూపడము లాభదాయకమని భావించి ఆ వ్యాపారంలో నిమగ్నులై వున్నారు. ఓడలలో ఈ బానిసలను అట్లాంటిక్ మహాసముద్రము దాటించి, బావగా మిగిలిన వారిని నీలి మందు, వరి, పొగాకు తోటలుగల భూస్వాములకు అమ్మేవారు. ఈ విధంగా అమెరికన్ వలసలలో గల మొత్తము నీగ్రోల సంఖ్య అయిదు లక్షలు. మొత్తము జనాభా ముప్పై లక్షలలో వీరు ఆరవ భాగమున్నారు. దక్షిణ వలసలలో వారి సంఖ్య మరీ ఎక్కువగా వుండేది. ప్రతి ఒక శ్వేతవర్ణునికీ, ఇరవైమంది నీగ్రోల నిష్పత్తిలో వుండేవారు. వీరిని బలవంతాన తీసుకొచ్చి, బానిసత్వంలో వుంచడమనే వ్యాపారము అలా సాగుతూనే వుంది. కాంగ్రెస్ ప్రతినిధులలో కొందరు ఈ నీగ్రోలవల్ల తిరుగుబాటు జరుగుతుందేమోనని భయపడ్డారు. ఆంగ్ల ప్రభుత్వము వర్జీనియా రాష్ట్రంలో ఒక వెయ్యిమంది సైన్యాన్ని దింపి, తమ పక్షముజేరిన నీగ్రోలకందరికీ స్వాతంత్ర్య మిస్తామని ప్రకటిస్తే అక్కడ గల ఇరవై వేలమంది నీగ్రోలు పదిహేను రోజులలో ప్రభుత్వపక్షంజేరిపోవచ్చు.

దక్షిణ కెరోలినా ప్రతినిధి రట్లెడ్జ్ ఈ అభిప్రాయాన్ని ఆమోదించలేక పోయాడు. "ఆంగ్ల ప్రభుత్వ మిత్రులు చాలామందికి తోటలు వున్నాయి. వారి ఆస్తులు బానిసల రూపంలోనూ, వ్యవసాయ క్షేత్రరూపంలోను వున్నాయి. నీగ్రోలు లేకపోతే ఇవి పోతాయి గనుక వారు ఈ పద్ధతిని ప్రోత్సహించరు" అన్నాడు. నార్‌ఫక్ గవర్నరైన లార్డ్ డన్‌మోర్ నీగ్రో పటాలాలని తయారు చేసేందుకై నడుంకట్టాడు. వర్జీనియా ప్రతినిధులలో ఒకతను అన్నాడు : "బానిసత్వము నిషేధింపబడాలి. అది మానవస్వభావాన్ని కలుషితం చేస్తుంది. బానిసల అధికారి ఒక చిన్న నియంత - అతనిని రాక్షసత్వము తప్పని సరిగా ఆవహిస్తుంది"

"ఈ బానిసత్వపు మంచి చెడ్డలు ఏ రాష్ట్రానికా రాష్ట్రం నిర్ణయించుకోడం మేలు" అన్నాడు రట్లెడ్జ్, మేసాచుసెట్స్‌కి చెందిన జాన్ యాడమ్స్ తన స్థానములో నిలబడి ఇలా చెప్పాడు. "ఈ బానిసపద్ధతి మన సిద్ధాంత సూత్రాల్లో ఇమడదు ; అందుకు రేకమైనది." రట్లెడ్జ్ వెంటనే సమాధానము చెప్పాడు. "ఇది నీతికీ వివేకానికీ సంబంధించిన దెంత మాత్రమూ కాదు, ప్రయోజనము. అదే అన్ని జాతులకీ అన్నిదేశాలకీ మూలసూత్రము. ఇప్పుడు ఒక వ్యాపార విధానాన్ని కాదనడము దక్షిణ కెరోలినాకి నష్టహేతువు. న్యూ ఇంగ్లండు తమ ప్రయోజనాల గురించీ, తమకి లాభసాటిగా వుండేవాని గురించీ ఆలోచించుకుంటున్నపుడు, మరొక రాష్ట్రానికి లాభదాయకమగు విధానాన్ని కాదనడమన్యాయమేలాఅవుతుంది ?"

రట్లెడ్జ్ చెపుతున్న మాటలలో తన వాక్యాలపునశ్చరణవున్నదనీ, ఎటొచ్చీ అతను అదే విషయాన్ని మరొక కోణము నుంచి చూస్తున్నాడనీ యాడమ్స్‌కి తెలుసు. దక్షిణ రాష్ట్రాలకి బానిసలని చేరవేసే ఓడలు న్యూ ఇంగ్లండు వాసులవి. ఈ నౌకా వ్యాపారములో వారు బాగా భాగ్యవంతులవడము వల్ల, ఇప్పుడు ధర్మపన్నాలు చెప్పడానికి వీలయింది.

"బానిసపద్ధతికి చెందిన పేరా అంతా స్వాతంత్ర్య పత్రమునుంచి తీసి వెయ్యాలి. అదిగాని అలా వుంటే దక్షిణ కెరొలినా ఈ పత్రాన్ని ఆమోదించదు" అన్నాడు రట్లెడ్జ్. వర్జీనియా రాష్ట్ర ప్రతినిధులు కూడా అదేమాట అన్నారు. బానిసత్వ నిర్మూలన గూర్చి మరీ పట్టుబడితే, రాష్ట్రాల ఐక్యతకే భంగము వాటిల్లే ప్రమాద మేర్పడుతున్నదని యాడమ్స్ గ్రహించాడు. అప్పటికే కాలాతీతమయింది. మర్నాడు వుదయము తొమ్మిది గంటలకు సభ వాయిదా వేయడమైనది.

ఫిలడల్ఫియాలోని ప్రతినిధులు స్వాతంత్ర్య పత్రంలోని క్లాజులు పరిశీలిస్తుండగా కనెక్టికట్‌కి చెందిన సైలాస్‌డీన్ అట్లాంటిక్ సముద్రము దాటి ఫ్రాన్సు దేశానికి రహస్య రాయబారిగా వెళ్తున్నాడు. విదేశ వ్యవ

హారాలమంత్రి కౌంట్ వెర్జినీస్‌తో సమాలోచనలు జరిపి ఆయుధ సామాగ్రి విప్లవ సేనలకు అమ్మేటట్లు బేరసారాలు జరిపేందుకు వెళ్ళుతున్నాడు. అక్కడ అవి కొన్న తర్వాత వాటిని క్షేమంగా యిల్లు చేర్చడమనేది మరొక సమస్య. తుపాకులు మందుగుండు సామాను సమృద్ధిగా లేకపోతే విప్లవసేనలు సర్వశక్తివంతమగు సామ్రాజ్య సేనలను ఎదుర్కోలేవు. ఈ ఆయుధాలు అమెరికా చేరుకునేందుకు కనీసం ఆరునెలలు పడుతుంది.

కాంగ్రెస్‌లోని దూరదృష్టిగల సభ్యులు, స్వాతంత్ర్య ప్రకటన చేయబోయే ముందు, బ్రిటన్‌కి యుద్ధ విరోధులైన వారితో ఒక ఒప్పందం ఏర్పరచుకొని, వారిని కూడగట్టుకుని, ఆ పైన సామ్రాజ్యశక్తులతో తలపడాలి అని భావించారు. ఇప్పుడిప్పుడే తల ఎత్తుతున్న ఒక నూతన దేశానికి ఇటువంటి ఏర్పాట్లు లాభసాటి కాజాలవనే అభిప్రాయములో వుండేవాడు డాక్టర్ ఫ్రాంక్లిన్. ప్రారంభంలో ఎవరి సహాయము లేకుండా అమెరికా తనకి తానుగా నిలబడి, గొరిల్లా యుద్ధం చేస్తూ శత్రువుకి విసుగు తెప్పించి వోడించాలని అతని వుద్దేశ్యము. కాని శత్రుసైనిక బలము గురించి ఈ మధ్య అందిన వార్తలు ఆ అభిప్రాయాన్ని మార్చివేశాయి.







కమిటీవారు సైలాస్‌డీన్‌ని ఫ్రాన్స్ దేశానికి రహస్య రాయబారిగా ఎన్ను కున్నపుడు, ఐరోపా రాజకీయాలతో అనుభవంలేని ఈ రహస్యగూఢచారికి, పదహారో లూయీ ఆకటావికటపు మంత్రులని ఎలా ప్రసన్నులుగా చేసి తమవైపు తిప్పుకోవాలో కిటుకు లన్నీ తెలియబరిచాడు ఫ్రాంక్లిన్. రాజకీయాలతో ఏ మాత్రము సంబంధము లేని ఒక వలస దేశవర్తకుని వలె తన పాత్రను నిర్వహించాలి. ఇతను బహుకొద్ది మందికే తెలుసు. కాని కార్యదర్శి థామ్సన్ కూడా ఈ రహస్యశాఖ నిర్వహణలో ముఖ్య పాత్ర వహిస్తున్నాడు. థామ్సన్‌కి అనేక ప్రదేశాలలో గూఢచారు లున్నారు. విండ్సర్‌కాజిల్ నుంచి అతనికి రహస్య సమాచారాలు అందు తూండేవి. జేమ్స్‌లివింగ్‌టన్ అను పత్రికా సంపాదకుడు, న్యూయార్క్ గెజిటీర్ అను పత్రిక ప్రచురణకర్త ఇటు వంటి ప్రముఖులనేకులు థామ్సన్‌కి రహస్య సమాచారము లందజేస్తూండే వారు. కనిపించని సిరాతో ఎలా ఉత్తరప్రత్యుత్తరాలు జరపాలో, డీన్‌కి నేర్పాడు థామ్సన్. సాంకేతిక భాషలతో పరిచయం కలిగించి సంకేతాలు గుర్తులతో సమాచారము తెలిపే పద్ధతులతో అతనికి తర్ఫీదు యిచ్చాడు. ఈ ఆయుధ సేకరణలో గల కష్టనష్టాల గూర్చి ముందే ఆలోచించు కున్నాడు. సైలాస్‌డీన్‌కి నాలుగువేల పౌనులు రొఖ్ఖంగా యిచ్చి, అతనికి కావలసినన్ని బాంక్ ప్రామిసరీనోట్లు సప్లయి చేశాడు. ఈ రొక్కము అతను సంపాదించబోయే అప్పూ - వీటి విషయములో అతనిని సర్వస్వతంత్రునిగా చేశాడు.

ఈ ఏర్పాట్లు ప్రకారం సైలాస్‌డీన్ మార్చి నెలలో 'రాఫెల్లే' అను ఓడ ఎక్కి ప్రయాణం సాగించాడు. ప్రస్తుతము అతను డెలవార్ ప్రాంతాల సముద్రముఖముగా ప్రయాణము సాగిస్తున్నాడు. మూడునెలలపాటు అతను తన ఓడ కాబిన్‌లోనే రుగ్మతవల్ల వుండిపోవలసి వచ్చింది. బైబిలు చదువుకుంటూ ఈ ప్రమాదయాత్రలో తను విజయము పొందగలనా లేదా అని లెక్కలు వేసుకుంటూ, తన సాహసానికి తనే ఆశ్చర్యపోతూ ముందుకు సాగుతున్నాడు సైలాస్‌డీన్.

ఈ సైలాస్‌డీన్, కనెక్టికట్ రాష్ట్రంలో గ్రోటన్ అనే గ్రామంలో ఒక సామాన్య కుటుంబంలో జన్మించాడు. ఏల్ విద్యాలయంలో విద్యనభ్యసించి, ఒక సంవత్సరంపాటు, ఉపాధ్యాయునిగా పనిచేసి, ఆ తరువాత న్యాయశాస్త్రము చదివాడు. హార్ట్‌ఫోర్డ్‌కి నాలుగు మైళ్ల దక్షిణంగావున్న వెదర్స్‌ఫీల్డులో నివాస మేర్పరుచుకున్నాడు. ఈ వెదర్స్‌ఫీల్డు పట్నము ఒక వ్యాపార కేంద్రం. సైలాస్‌డీన్ ప్రముఖ పౌరులలో ఒకడయ్యాడు. ఈ స్వాతంత్ర్య ప్రయత్నంలో తనుకూడా యధోచితపాత్ర నిర్వహించాలని ఉత్సాహము కనబరచగా రెండు సంవత్సరాల క్రితము ఆ ప్రాంతాలవారు ఇతనినితమ ప్రతినిధిగా

ఎన్నికొని, పి ల డ ల్ ఫి యా లో ప్రతినిధుల సభకి పంపారు.

రెండవసారి తిరిగి ఎన్నికయేసరికి, ఇతను యూరప్‌నుంచి ఆయుధ సామగ్రి తెప్పించేందుకు చేసే ప్రయత్నాలకు చెందిన కమిటీలో సభ్యునిగా వున్నాడు. చర్చలలో ఏనాడు పాల్గొనక పోయినా ప్రముఖ ప్రతినిధులలో ఒకనిగా పేరు పొందాడు.

క్లిష్ట పరిస్థితులు ఏర్పడుతున్న కొద్దీ బయట దేశాలనుంచి ఆయుధ సహాయం పొందటమనే ప్రశ్న తీవ్రతరం కాజొచ్చింది. ప్రభుత్వ భవనములో జాన్‌యాడమ్స్ ఈ విషయముపై ముచ్చటించడము అనేకసార్లు విన్నాడు డీన్. ఇతర దేశాలతో ఒప్పందాలు, మన స్వాతంత్ర్యావతరణ రెండూ కుడి ఎడమలవలె ముందుకు సాగాలి, అని సమయము వచ్చినపుడల్లా చెప్తూండేవాడు యాడమ్స్. "మనము ఒక్కుమ్మడిగా వారి సహాయము అభిలషిస్తే తప్ప, బయట దేశాలవారు మనలోని ఐక్యతను ఎలా గుర్తించగలుగుతారు? మనందరము ఒకటేనని వారికి ఎలా తెలుస్తుంది?" అనేవాడు.

కొందరు ప్రతినిధులు "సామ్రాజ్య కాంక్షగల ఫ్రాన్సు మరొక సామ్రాజ్యపు అంతరంగిక వ్యవహారాలలో కల్పించుకుంటుందా? ఈ వలసలకి వారు సహాయం చేయడం కల్ల" అంటూండేవారు. అందుకు యాడమ్స్

ఇలా సమాధానం చెప్పేవాడు. "బ్రిటీష్‌వారి వలసలు స్వతంత్రము గా వుండడమే ఫ్రాన్సుకి లాభదాయకము - అందుకనే వారు సహాయము చేయవచ్చునని అంటున్నాను. బ్రిటన్ ఈనాడు తన సామ్రాజ్య విస్తరణలో అత్యున్నత స్థానము ఆక్రమించింది; ఫ్రాన్సు అసూయపడడమే తప్ప ఏమీ చేయలేకుండా వున్నది. ఇది దుస్సహ పరిస్థితి గనుకనే ఫ్రాన్సు మనకి సహాయము చేసే అవకాశము వుంది."

1776 నాటికి సైలాస్‌డీన్ కాంగ్రెస్ సభ నుంచి తన ప్రతినిధి స్థానాన్ని విరమించుకున్నాడు. అప్పటికప్పుడే రెండుసార్లు ఎన్నికయాడు; మూడవసారి ఎన్నికకాలేదు. సైలాస్ డీన్‌ని రహస్య కమిటీవారు, ఫ్రాన్సుతో తాము చేసుకోగల ఒప్పందానికి రాయబారిగా నియమించారు. రాజనీతిలో ప్రఖ్యాతుడైన డాక్టర్ ఫ్రాంక్లిన్, సైలాస్‌డీన్‌కి కావలసిన సరంజామా అంతా అందించి, తనకు ఒకనాడు దుబాసీగా పనిచేసిన 'డుబారో'కి ఒక పరిచయలేఖ వ్రాసి యిచ్చి, అతని ద్వారా కార్యం నెరవేర్చుకు రమ్మనీ, అతను దుబాసీగా పనిచేస్తూ, ముఖ్యులతో పరిచయాలు ఏర్పరుస్తాడనీ చెప్పాడు.

అట్లాంటిక్ ప్రయాణములో ఈ రహస్య రాయబారి, ఫ్రాంక్లిన్ సూచనలని యించుమించు కంఠస్థం చేశాడు. "నీవు ఫ్రాన్సు చేరుకున్నాక కొన్నాళ్ళపాటు రెడ్ ఇండియనులతో వర్తక వ్యాపారాలు సలుపుతున్నట్లుగా, వారికి కావలసిన సరుకు మాత్రమే కొనుగోలు చేస్తూవుండు. నీవు ఈ అమెరికా వలసల నుంచి వచ్చినట్లుగా ఫ్రెంచి రాజోద్యోగులకి అనుమానము కలుగనీయకు. దుబాసీ ద్వారా ఈ కనెక్టికట్ రాష్ట్రవాసి, ఫ్రెంచి విదేశ వ్యవహారాల మంత్రితో ఒక రహస్య సమావేశాన్ని కోరాలి. ఆ ప్రయత్నంలో జయము పొందితే, అప్పుడాయనతో ప్రసంగవశాన అమెరికన్ వలసలలో ఇరవై అయిదువేల మంది ప్రజలు ఆయుధాలు లేక అలమటిస్తున్నారనీ స్వదేశ రక్షణార్థం వారు ఆయుధాలు కోరుతున్నారనీ నేర్పుగా అతనికి సానుభూతి కలిగే విధంగా ఈ విషయము వెల్లడించాలి. ఇందుకు ప్రతిగా, బ్రిటిష్‌వారు ఈనాడు తమ హస్తగతం చేసుకున్న వ్యాపారాన్నంతటినీ ఫ్రెంచి వారికి అప్పగించేందుకు తను అనేసి, ఇతర విషయాలలో ఆ మంత్రి అభిప్రాయమేలా వున్నదో తెలుసుకోవాలి. తమ వలసలన్నీ ఏకమై ఒక దేశంగా ఏర్పడితే, ఫ్రాన్సు తమను రాజకీయంగా గుర్తించగలదా? ఫ్రాన్సు తమతో వ్యాపార సంధిగాని, రక్షణ సంధిగాని, ఇటువంటి ఒప్పందాలేమైనా ఏర్పాటు చేసుకునేందుకు సముఖంగా వున్నదా?"

బ్రిటీష్ నౌకల కంటపడకుండా, సైలాస్‌డీన్ ప్రయాణం చేస్తున్న ఓడ, దక్షిణ స్పెయిన్‌లోని 'కార్టాజనా' వద్ద నిలిచి అక్కడ లంగరు వేసుకున్నది. సైలాస్‌డీన్, వెలెంషియా, అరగాన్,

స్, నిమోజిస్ టూర్స్ వైపుగా ప్రయాణం చేశాడు. ఆయా పట్నాలలో గల వ్యాపార ప్రముఖులతో రెడ్ ఇండియన్ వ్యాపారానికిగల సరుకులేమయినా దొరుకుతాయేమోనని వాకబు చేశాడు.

పారిస్ చేరుకునేసరికి జులై నెల వచ్చింది. పారిస్ ఎంతో స్నేహపాత్రంగా కనిపించింది సైలాస్‌డీన్‌కి. కాని పట్నం నిండా బ్రిటీష్ ఏజెంట్లు, గూఢచారులు వున్నారు. బ్రిటీష్ రాయబారులు అప్పటికే ఫ్రాన్సు, స్పెయిన్, హాలెండ్ దేశాలకు అమెరికాలోని విప్లవసేనలకు ఎటువంటి సహాయం చేసినా, అది తమపై శత్రుచర్యగా భావిస్తామనీ ఆయాదేశ ప్రభుత్వాలు ఈ విషయంలో జాగరూకులై వ్యవహరించాలనీ, కడుధీమాగా సందేశాలు అందజేసారు. సైలాస్‌డీన్ ఎంతో నేర్పుగా దుబాసీ 'డుబారో'ని కలుసుకున్నాడు. అతని ద్వారా ఫ్రెంచి విదేశాంగ మంత్రితో రహస్య సమావేశం ఏర్పాటు చేసుకున్నాడు.

ఫ్రాన్సులోని రాజకీయ పరిస్థితి అనిశ్చితముగా వున్నది. గడిచిన యుద్ధంలో ఫ్రాన్సు, ఇంగ్లండువల్ల న్యూనత పొందింది. ఫ్రెంచి వ్యాపారం బాగా దెబ్బతిన్నది. ఫ్రెంచి ప్రజలు అసంతృప్తులై, లేమితో బాధపడుతున్నారు. అమెరికాలోని తిరుగుబాటుదార్లకి సహాయం చేయడం విషయంలో ఫ్రాన్సులోని ప్రజాభిప్రాయం రెండు విధాల చీలివుంది. యువకుడైన పదహారవ లూయి, ఫ్రాన్సు ఏవిధంగానైనాసరే శాంతిని కాపాడుకోవాలనే పట్టుదలతో వున్నాడు. పలుకుబడిగల ఆర్థిక మంత్రి టర్గాట్ పదహారవ లూయికి ప్రోత్సాహమిస్తూ, అతని పక్షము నిలబడివున్నాడు. ఇంగ్లండుతో యుద్ధం పరమ మూర్ఖత్వం, ఫ్రాన్సు

సర్వనాశన మవుతుంది - అన్నాడు. టర్గాట్‌లా పదహారవ లూయికి కూడా విప్లవాలపట్ల అంత సదభిప్రాయం లేదు. తన గొడవలు తాను చూసు కుంటే చాలు, తన ఇల్లు తాను సరిదిద్దు కుంటే చాలు అన్నదే - ఆనాటి ఫ్రెంచి రాజనీతి. 'ఆ వైరులిద్దరివీ అలసి పోనిద్దాము - మనకేల ?' అన్న అభి ప్రాయములో పదహారవ లూయి, అతని మిత్రులూ వున్నారు.

ఫ్రాన్సులో మరొక అభిప్రాయము కూడా వున్నది. వారి దృష్టి ఈ రాజ వర్గ సంప్రదాయాలకు పూర్తిగా వ్యతి రేకము. 1774 నాటికి పదిహేనవ లూయి మరణంతో నూతన భావాంకు రాలు దేశమంతటా వ్యాపించాయి. బహిష్కృతులైన్ వాల్టే, రూసోలు నూతన తరంవారికి వీరపురుష లయారు. ఈ నూతన తరమువారు చితికిపోయిన తమ సంఘపు కట్టు బొట్లను విమర్శనా చింతనతోను వినిర్మలదృష్టితోనూ పరికించారు. సాహసికులైన ఈ అమెరికనులు, ఊహించరాని కష్టాలు ఎదుర్కొంటూ, తమ స్వాతంత్ర్యాన్ని ధైర్యంగా ప్రకటించగలిగారు. తాము సర్వ స్వతంత్రులమని ధీరులవలె పలుకు తున్నారు. తాము కలలుగన్న ప్రజారాజ్యానికి, దూరములోగల ఈ అమెరికనులు పునాది వేస్తున్నారు. వర్ధమాన రాజకీయ విద్యార్థులు అమెరికా వైపు ఆశతో చూస్తున్నారు. మానవుని హక్కులు కాపాడగల భూతల స్వర్గమది - అని భావిస్తు న్నారు. ఈ పోరాటంలో అమెరికనులు విజయము పొందితే, వారి రేవు పట్నా లన్నీ స్వేచ్ఛా వ్యాపారానికి తెరువ బడతాయి-అని ఆర్థికవేత్తలు జోశ్యము చెబుతున్నారు. మానవుని అంతరాత్మ ఆ పవిత్రభూమిపై బంధాలు తెంచు కుంటోంది - అన్నారు మతజీవనులు. మతము, ప్రభుత్వము ఆ నేలపై విడి విడిగా ప్రయాణము చేస్తాయి అంటు న్నారు హేతువాదావలంబకులు. అమె రికా గాని విజయము పొందితే ప్రపంచ మంతటా వలసరాజ్య విధానానికి స్వస్తి చెప్పడము జరుగుతుంది - అంటున్నారు మరికొందరు.

మధ్యతరగతికి చెందిన బుద్ధి జీవను లలోనే గాక భాగ్యవంతులలో కూడా ఒక వర్గమువారికి ఈ విప్లవభావాలు, కాలస్వభావాను గతములు అనిపిం చాయి. సుమారు అయిదులక్షల కుటుం బాలు ప్రజాభీష్టము ప్రకారము రాజ్య పాలన సాగాలనే నిర్ణాయానికొచ్చాయి. దుబార మనిషి అయిన మెరీ యాం టొనెటీ కొన్ని నూతన పద్ధతులు అవలంబించింది. స్థిరచిత్తుడు గాని పదహారవ లూయిపై తన ప్రభావాన్ని ప్రయోగించింది. టర్గాట్‌ని మంత్రి పదవి నుండి తొలగించింది.

విదేశాంగమంత్రి అయిన మౌంట్ 'వెర్జినీస్' ప్రస్తుత రథసారథి అయాడు. బ్రిటిష్ వారికి ఎటువంటి అను మానమూ సోకకుండా భారీ ఎత్తున శాంతి ప్రయత్నాలు ప్రారంభించాడు. కాని రహస్యంగా మరో పద్ధతి అవలంబిస్తున్నాడు. సమర్థుడైన రహస్య

గూఢచారి తనకు లభించాడు. అతని ద్వారా బ్రిటిష్ వారిపై కక్ష సాధించవచ్చు. సైలాస్‌డీన్‌కి కౌంట్ వెర్జెనీస్ దర్శనమిచ్చినపుడు, ఆ గౌరవ సంభాషణలో మర్యాద మన్నన తప్ప, తనుగాని, తన ప్రభుత్వము గాని సహాయము చేస్తామన్నది మాట మాత్రముగా కూడా లేదు. ఫ్రాన్సుకి ఈ స్వతంత్ర్యేచ్ఛపట్ల సానుభూతి కలదని మాత్రమే ముక్తసరిగా అన్నాడు. ఫ్రాన్సు అమెరికాలోని వలసలతో ఎటువంటి సంబంధాలు పెట్టుకోజాలదనీ, ఎటువంటి ఒప్పందాలు ఏర్పరుచుకోదనీ స్పష్టంగా డాక్టర్ ఫ్రాంక్లిన్ కంటె ముప్పై ఏళ్ళ







చిన్నవాడు కాని వాక్పటిమలో అయన కేమాత్రమూ తీసిపోడు. వ్యాపారి, పరిశోధకుడు, కవి, గాయకుడు, ఆర్థిక వేత్త, రాజనీతిజ్ఞుడు, ఖడ్గవిద్యా ప్రవీణుడు. రాజులకీ మంత్రులకీ రహస్య సమాలోచనలలో ఆంత రంగిక వ్యవహారాలలో సలహా చెప్ప గల ధీమంతుడు. ఉన్నతవర్గాల వారికి ఇష్టుడు. ప్రజల దృష్టిలో ఒక ప్రఖ్యాత వ్యంగ్య రచయిత. హాస్య నాటకకర్త; అతను 'ది బార్బర్ ఆఫ్ సెవిల్లి' అను పేరుతో రాసిన కామెడీ ఫ్రెంచి సాహిత్యములో ఒక ఉన్నత స్థానాన్ని పొందింది.

పదిహేనవ లూయి ఈ 'బూమార్చియా' ని తన రహస్య ప్రతినిధిగా నియమించుకున్నాడు. రహస్య ప్రతినిధిగానే ఇతనొకసారి లండన్ వెళ్ళి, అక్కడ అమెరికన్ మిత్రులతో చెలిమిచేసుకుని వచ్చాడు. అమెరికా లోని వలసల పరిస్థితులు, స్థితిగతులు తమకు అవసరమైనంత వరకు తెలుసుకున్నాడు. అమెరికనులు తమ ప్రాణాలకు తెగించి స్వాతంత్ర్యం కోసమై పోరాడుతారన్న నమ్మకం ఏర్పడ్డ 'బూమార్చియా' వారికి ఈ ప్రయత్నములో సర్వవిధాలా సహాయము చేసేందుకు నడుం కట్టాడు. ఫ్రెంచివారిని విప్లవ సేనకు సహాయము చేయమని వుద్బోధించాడు. ఒక క్షణంకూడా జాప్యం చేయరాదనీ ఇదేమంచి సమయమనీ రాజుకిచెప్పాడు. ఎప్పుడైతే ఇంగ్లండు, వలసలు పోగొట్టు కుంటుందో, ఆనాటినుంచీ దాని శక్తి, వుడిగిపోతుంది గనుక ఫ్రాన్సు, ఆంగ్ల సేనల భయంలేకుండా హాయిగా వూపిరి పీల్చుకోవచ్చు. ఫ్రాన్సుకి ముందు ముందు చేకూరే లాభాలతో పోల్చి చూస్తే అమెరికా ఈనాడు కోరుతున్న సహాయము అతి స్వల్పము. ఒక చిన్న విత్తనము, అదనులో నాటితే అది ఎంతటి ఫలాన్ని నీడను ఇస్తుందో చెప్ప నవసరం లేదు. 'బూమార్చియా' కి వెర్జినీస్‌పట్ల చాలా నమ్మకమున్నది. కాని అతనికి తను పంపే నివేదికలో భాష మరొకతీరున వుండేది. "అమెరికనులు త్వరలోనే తమ ఇంటికి తాము ప్రభువులు కానున్నారు. వారి కోరిక మనము ఆలకించక పోవడమువల్ల వారిని మనము దూరము చేసుకుని, మంచి స్నేహితులని పోగొట్టుకున్న వారమవుతామేమో!"

సైలాస్‌డీన్ రోడిరీగో కంపెనీ అధ్యక్షుని చూడడానికి వెళ్ళాడు. అతి ప్రశాంతంగా కనిపిస్తున్న ఆ భవన ప్రాంగణములో ఎంతో పెద్ద వ్యాపారము జరుగుతోంది. నిండైన ఆకారంతో, విశాలభావ ప్రస్ఫుటితమైన ముఖం. చిరుహాసంతో కొంచెం పొడవుగా కనిపించే బూమార్చియా, సైలాస్‌డీన్ బుజము మీద చేయివేసి, అతనిని ఆ గుంపులో నుంచి చేయి పట్టుకు తీసుకెళ్తూ తన ప్రయివేటు రూము చేరుకున్నాడు.

'మౌంట్ వెర్జినీస్ మిమ్మల్ని చూడమన్నారు,' అంటూ నెమ్మదిగా గౌరవ వాచకాలతో సంభాషణ ప్రారంభించాడు.

సైలాస్‌డీన్ కాని 'బూమార్చియా' అవన్నీ కట్టిపెట్టి "అవునవును నాక దంతా తెలుసు. ఆయనకు నాపట్ల నమ్మకమున్నది. అటువంటి విశ్వాస బాంధవ్యమే. మనిద్దరి మధ్యాకూడా ఏర్పడాలి. మీకు ఏవిధంగా సహాయ పడగలనో చెప్పండి - సిద్ధముగా వున్నాను" అన్నాడు. ఒక్కముక్కలో సైలాస్‌డీన్‌కి బరువు దించినట్లయింది. "అమెరికాలో మా సమస్య ఎటువంటి దంటే, మాకు కొంత సహాయము బయట దేశాలనుంచి కావాలి."

వ్యాపారి అయిన 'బూమార్చియా' వ్యాపార ధర్మము దృష్ట్యా ఇలా అన్నాడు. 'మీ అవసరాలు, మీ బాధలు నాకు బాగా తెలుసు. మా ప్రభుత్వము మీవారికి సహాయము చేసేందుకుగాను నేను శతవిధాల ప్రయత్నించాను. లాభము లేక పోయింది. ఇప్పుడు నేనొక కొత్త పదతి అవలంబించబోతున్నాను .మాది ఒక ప్రయివేట్ కంపెనీ, మా కంపెనీ మీకు ఆయుధాలు అమ్ముతుంది. మాకు ఆయుధాలెక్కడినుంచి వస్తున్నా యన్నది మీకనవసరము. మావద్ద నుంచి కొన్న ఆయుధాలకి మీరు మాకు సొమ్ము చెల్లించాలి. ఇవ్వాళ కాదు - మీదగ్గిర డబ్బు వున్నపుడు," సైలాస్‌డీన్ తన చెవులని నమ్మలేక పోయాడు. లోకంలో ఇంత మంచి వాళ్ళు వుంటారా అని ఆశ్చర్య పోయాడు.

"వెర్జినీస్ నాతో చెప్పాడు. అతి రహస్యముగా చెప్పాడు. నీవు సహా యము చేయదలచుకుంటే మాకు అభ్యం తరము లేదు. ఆ లాభనష్టాల పూచీ నీది. కాని ప్రభుత్వము సప్లయిచేయదు. నీకు ఎంత ఆయుధ సామాగ్రికావాలో చెప్పు - ప్రభుత్వముచేత నీకు అప్పు యిప్పిస్తాను."

తనింకా ఏదో బ్రతికిమాలాలనీ. తన ప్రజల ధీరత్వము గురించి చెప్పు కోవాలనీ, తమ కష్టనష్టాలతో వారి మనసు కరిగించాలనీ ఎన్నెన్నో అను కున్నాడు. అదేమీ లేకుండానే ఒక్క తృటిలో అనుకున్న పని అయి పోయింది. అతని ప్రార్థనలకు సమా ధానముగా ఫ్రెంచి మిత్రుల సహ కారం లభిస్తోంది. వాషింగ్టన్ సేనలకు ఫ్రెంచివారి ఆయుధాలు లభిస్తాయి. సైలాస్‌డీన్‌కి ఫ్రాన్సు ఈ మధ్యనే తన ఆయుధాలని 'లైటర్ టైపు' కి మార్చిందని తెలియదు. బరువైన ఆయుధాలు - అనగా సుమారు యెనభై వేల తుపాకులు, ఫిరంగులు ప్రభుత్వ ఆయుధాగారాలలో నిరుప యోగముగా పడివున్నాయి. ఇవన్నీ సర్‌ప్లస్‌గుడ్స్ - మిగులు సరుకు.

"ఈ ఆయుధాలకి మేము ద్రవ్య రూపంలో చెల్లిస్తాము" అన్నాడు సైనాస్‌డీన్. "అబ్బే మాకు ద్రవ్య మెందుకు ? మరొక రూపంలో దీనికి ముదరా చెప్పవచ్చు. ఈ ఆయుధాలకి గాను, మీరు మీదేశంలో పండిన పొగాకు, బియ్యము, జనపనార, నీలి మందు మొదలైనవేవైనా మీకు వీలయినవి మాకు యివ్వవచ్చు. రోడరిగో కంపెనీకి యూరప్‌లోని

అన్ని మార్కెట్లలోనూ ప్రవేశముంది అన్నిరకాల సరుకులు మావద్ద చెల్లుబడి అవుతాయి" ఆయుధ సామాగ్రి సరఫరా విషయములో ఇరుపక్షాల వారు వ్యాపార షరతులు స్పష్టముగా తెలుసుకోడం మంచిదని సైలాస్‌డీన్ అభిప్రాయం. "పరిస్థితులు అనందిగంగా వున్నాయి. సంవత్సరములోపున మేము మీ సొమ్ము చెల్లించలేకపోతే, దానికి ఆరుశాతము చొప్పున పొలుసరి వడ్డీ చెల్లిస్తాము. మీకు అందు విషయమై ప్రామిసరీనోటు యిచ్చేందుకు నాకు అధికారాన్ని ఇచ్చారు...." "నాకు ఈ నోట్లు పత్రాలు అక్కరలేదు. నేను సుగుణ వంతులగు ప్రజలతో వ్యాపారం చేస్తున్నాను. నేను మీకు ఎంత విలువగల సరుకు ఇచ్చానో వ్రాసుకుంటే చాలు - అంతకు ముదరా మీరే పంపుతారు"....బూమార్చియా మాటలను సైలాస్‌డీన్ సమ్మలేకుండా వున్నాడు. తన ఆనందాన్ని పట్టలేకుండా వున్నాడు. షరతులు, బేరాలు, నోట్లు ఎన్నెన్నో అనుకుంటూ వచ్చిన డీన్‌కి ఇదంతా ఆశ్చర్యంగా వున్నది.

'బూమార్చియా' తనే అన్నాడు: 'ఆయుధాలతోపాటు మీకు ఆయుధ నిపుణులుకూడా కావలసి వుంటారు. అనుభవంగల ఆఫీసర్లు కావాలి. ఉదాహరణకు మార్క్విస్, లఫ్‌యెటీ వంటి వారు ఫ్రెడరిక్‌రాజు సేనాధిపత్యంలో సేనలు నడిపించిన వుత్తమ సేనాధిపతులు. వెనుకటి పోలిష్ స్వాతంత్ర్య యుద్ధములో పాల్గొన్న నాయకులు అనేకులు ఇక్కడ ఈ పారిస్‌లో వున్నారు. వారు సంతోషంగా వచ్చి మీకు సాయం జేస్తారు" ...."మాకు మిలటరీ ఇంజనీర్ల కూడా కావాలి" అన్నాడు సైలాస్‌డీన్.

"మీకు కావలసినంత మంది ఆయుధ నిపుణులను పంపిస్తాను. మీ పోరాటంలోని అంతర్యాన్ని మీకంటే మేము ఎక్కువ అర్థము చేసుకుంటున్నాము. ఇక్కడ యూరప్‌లో స్వాతంత్ర్యమనునది కనుమరుగై పోతోంది. స్వాతంత్ర్యాభిలాషగల మిత్రులందరు మీ తరపున వున్నారు: మీ వెంట నున్నారు; మీకు తప్పక జయము లభిస్తుంది" అన్నాడు బూమార్చియా. "మీకు ఎలా కృతజ్ఞత తెలుపాలో బోధపడకుండా వుంది. అమెరికా తన మిత్రులని ఏనాటికీ మర్చిపోదు" అన్నాడు సైలాస్‌డీన్ కృతజ్ఞతాంజలి ఘటిస్తూ. తన హోటల్‌రూమ్ చేరుకొని, వెంటనే ఫిలడల్‌ఫియాలోని రహస్యశాఖకు ఈ విషయము తెలియపరిచాడు. కనబడని సిరాలో ఎంతో ఆశాజనకంగా లేఖ రాశాడు. అసలు ఈ లేఖ వారికి జేరుతుందా? అట్లాంటిక్ మహాసముద్రపు బ్రిటిష్ దిగ్బంధమునుంచి తప్పించుకుని ఒక ఓడ అమెరికా చేరుకునేందుకు కనీసం మూడునెలలు పడుతుంది. అంతదాకా ఫిలడల్‌ఫియా శత్రుహస్తగతం గాకుండా వుంటుందా?

(ఇంకా వుంది)

మాతృక : కార్నెల్ లెన్‌గ్యెల్
తెలుగు : యన్నార్ చందూర్

# ఇతర డైలు అన్నీ కలిపి ఎంతమంది వాడుతారో అంతకంటే ఎంతో ఎక్కువ మంది తనంతటతానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డైనే వాడుతారు.

ఇవిగో 3 మంచి కారణాలు:




రెండు నైసర్గిక రంగులలో లభ్యం—
బ్లాక్ మరియు డార్క్ బ్రౌన్.

**1** తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డై మీ జుట్టుకు అందిస్తుంది నైసర్గిక రంగు, రూపం. జుట్టును మృదువుగ ఎలా కావలిస్తే అలా చక్కగా వుంచుకోడానికి దీనిలో కం కూడా వున్నది.

<u>నిజానికి, వేసుకొన్నారని మీరు చెప్పితే తప్ప ఎవరికీ తెలియదు.</u>

**2** ఇతర హేర్ డైలలాగా కాకుండా, తనంతట తానే వ్యా గోద్రెజ్ హేర్ డైని సులభంగా, అనుకూలంగా వేసుకో

<u>అవును, జుట్టును షాంపూ చేసుకోవడం లా ఎంతో సులభం.</u>

**3** తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డై నాణ్య సంబంధంగా మీరు నిశ్చింతగా వుండవచ్చు. ఎందుక మీ జుట్టును, చర్మాన్ని సంరక్షించడానికి ఇది ప్రత్యే తయారు చేయబడినది.

<u>పరిపూర్ణ రక్షణ—ఇదే గోద్రెజ్ వాగ్దానం.</u>

**గోద్రెజ్®** తనంతట తానే వ్యాపించే పర్మనెంట్ హేర్ డై.





# "వ్యవసాయమే నా వృత్తి"



ఆనందంతో చిన్న గంగారాంకు తన వృత్తి పట్ల గౌరవభావముంది.

దేశాన్ని పోషించే వృత్తి.

అతనికి మంచి ఆదాయాన్ని సమకూర్చే వృత్తి వ్యవసాయం. శ్రమించే పని అని కష్టం వచ్చే వ్యాపకమన్న రోజులు పోయాయి.

స్వతంత్ర భారత దేశం కర్షకులకు ప్రతిఫలం ముట్టే హామీ ఇచ్చింది. మెరుగైన విత్తనాలు, మెరుగైన సేద్యపు నీరు, విద్యుత్ సౌకర్యాలు, ఎరువులు, క్రిమి సంహారక మందులు, ఇవన్నీ చిన్న రైతులకు లభిస్తున్నాయి.

ఆధునికమైన వ్యవసాయ విధానం, మంచి ధర-లు ఇవన్నీ తమ పాత్రను నిర్వహించాయి. రైతులు ఈ సౌకర్యాలను పూర్తిగా వినియోగించుకుంటున్నారు.

కష్టించి పని చేయడం, సాంకేతిక పరిజ్ఞానం- ఇవి హరిత విప్లవానికి దారితీశాయి.

ప్రస్తుతం భారతదేశపు ఆహార ఉత్పత్తి 17 కోట్ల టన్నుల మేర జరుగుతోంది. 1947లో జరిగిన ఉత్పత్తికంటే 12 కోట్ల టన్నులు ఎక్కువ.

## మన పురోగతి మనకు గర్వకారణం

davp 83/278 Tel

# నా చిన్ననాటి ముచ్చట్లు

## కెయన్ కేసరి



'గృహలక్ష్మి' స్వర్ణకంకణం, తెలుగు వనితకు సాహిత్యపరమగు గుర్తింపు. స్త్రీజనాభ్యుదయ లక్ష్యంతో మద్రాసు నుంచి వెలువడిన మొట్ట మొదటి స్త్రీల పత్రిక 'గృహలక్ష్మి' ఒకనాడు 'భారతి' కి పండితులలోను, 'గృహలక్ష్మి' కి కవయిత్రులలోను, ఎంతో ఉన్నతమైన స్థానం ఉండేది. స్వర్ణకంకణమూ, పత్రికా యివే కాదు, ఎన్నో ప్రజాహిత కార్యాలు చేస్తూ 'కేసరి విద్యాలయం' స్థాపించిన కేసరి గారు, 'ఆత్మకథలా' 1953లో వ్రాసి వెలువరించిన 'ముచ్చట్ల'ని ఈ జులై సంచిక నుంచి ధారావాహికంగా మా పాఠకులకి అందజేయగల అవకాశాన్ని మహద్భాగ్యంగా భావిస్తున్నాము.

అప్పట్లో నా పెండ్లి సన్నాహమునకు కావలసిన సామానులను సమకూర్చుకొనవలసివచ్చెను. నాచేత డబ్బు లేనందున చిన్ననాటి స్నేహితుడగు అన్నం చెన్నకేశవులు శెట్టిగారిని మరల ఆశ్రయించితిని. శెట్టిగారు యింటిలో స్వతంత్రులుగారు. చిన్నవారు. తలిదండ్రులచాటున నున్నవారు, గనుక వారివద్ద ఆ సమయమున రొఖ్కంలేదు. ఆ కాలమున మద్రాసులో ధనికులు పురుషులుకూడ చేతులకు బంగారుకాపులను (మురుగుల) గొలుసులను ధరించు కొనుచుండిరి. మా శెట్టిగారు లావాటి మురుగులను గొలుసులను తొడుగు కొనియుండిరి. ఆ మురుగులు గొలుసులు వారిచేతికి వదులుగనుండెను. అప్పుడు శెట్టిగారు కంసలిబత్తుని వద్దకుపోయి తనచేతుల మురుగులలోని బంగారమును కొంత కోసి నాకుయిచ్చి పెండ్లినగలు చేయించమని చెప్పిరి. ఆ బంగారముతో ఆ కాలపు నాజూకు నగ, నెల్లూరిగజ్జెలపట్టెడను చేయించితిని. కాళ్లకు యేనుగగొలుసులు, పావడాలు, పట్టెగొలుసులు మేలైన జర్మన్‌సిల్వరుతో తయారుచేయించితిని. ఆ కాలమున పేరుపొందిన బాలామణియను ఒక దేవ దాసియుండెను. నాటకములలో ప్రసిద్ధిచెందిన నటకురాలు. తారా శశాంకము, డంబాచారి విలాసము యను నాటకములలో బాలామణిని చూచుటకు మద్రాసులో వేలకొలది ప్రేక్షకులు పోవుచుండిరి. బాలామణి అక్క కోకిలాంబ పురుషవేషమును ధరించెడిది. అప్పుడు బాలామణిపేరుతో చీరలను నేసి బాలామణి చీరెలని అమ్మెడువారు. ఆ చీరెలను రెంటిని నా పెండ్లికి కొంటిని. మెడకు పట్టెడ, కాళ్లకు గొలుసులు, కట్టుచీరెలతో పెండ్లికి ప్రయాణమై వూరికి పోతిని. పట్టంనుంచి పల్లెటూరికి పెండ్లిసన్నాహముతోపోగానే వూరివారందరు పట్టంచీరెలను, నగలను చూచుటకు పరుగెత్తివచ్చిరి. ప్రదర్శనము జరిగెను.

నా పెండ్లి మావూరికి సమీపమున చెదలవాడయను గ్రామమునయుండు శ్రీరాముల దేవాలయములో జరిగెను. మా వూరికిని చెదలవాడకును నడుమ గుండ్లకమ్మ యేరు అడ్డము. నిండుయిసుకలో చెదలవాడకు నడచిపోవలయిను. ముహూర్తమునాడు తెల్లవారగనే మాకు మంగళస్నానములయినవి. పాతపల్లకి వచ్చినది. చాకలివారి పల్లకిని మోయుటకు హంసపాదికలతో సిద్ధమైరి. మంగలివారే భజంత్రీలుకూడాను. పల్లకిలో కూర్చుంటిమి. పల్లకిసాగినది. ఏరుదాటినది. ఇసుకలోకి పోగానే చాకలివారి కాళ్లుకాలి ముందుకుపరుగిడ వలసి వచ్చెను. మేళగాండ్లు వెనుక చిక్కిరి. కూడవచ్చుపెండ్లివారి సంగతి నిక చెప్పనేలా ! తిన్నగ 12 గంటలకు దేవాలయము ప్రవేశించితిమి. ఒకమూల వంట ప్రయత్నము, మరియొకచోట పెండ్లి ప్రయత్నములు జరిగెను.

చెదలవాడ గ్రామము భోగముపడుచులకు ప్రసిద్ధికెక్కినది. ఈ గ్రామమున యుండు భోగమువారందరు దేవాలయ మాన్యములను అను

భవించుచు దేవుని కొలుచువారే. వీరిలో ముఖ్యముగ యెఱ్ఱబాయి నల్లబాయి యను పేరుగల యిద్దరు వేశ్యలుండిరి. వీరికీ పేర్లు శరీరపు రంగునుబట్టియే వచ్చినవి. ఈ యెఱ్ఱబాయమ్మ మామగారికి స్నేహితురాలగుటచే పెండ్లి సరఫరా చక్కగ జరిగినది. సాయంత్రము చదురుకూడ జరిగినది. పెండ్లి ముగించుకొని పల్లకినెక్కి చీకటికి ముందటనే యిల్లు చేరితిమి.

ఆ రాత్రియే వూరిలో వూరేగింపుకూడ. మా వూరేగింపు చూచుటకు వూరివారందరు కూడిరి. ఆ కాలమున నూనె దివిటీలకు బదులు కుడప పిడకలను కిరసనాయిలులో తడిపి దివిటీలు వెలిగించుచుండిరి చాకండ్లు.

వివాహానంతరము నేను మనుగుడుపులకు అత్తవారియింట్లో వారమురోజు లుంటిని. ఈ దినములలో గ్రామమునసబు, కరణం మొదలగువారు వారి తాతముత్తాతల నాటి పాత కోర్టురికార్డులను తీసుకవచ్చి నన్ను చదివి అర్థము చెప్పమనే వారు. పూర్వాచారపరాయణులు కొందరొచ్చి - అబ్బాయి, పట్నంలో జాతివాడు మరద్రిప్పిన గొట్టములోని నీరు త్రాగుచున్నారటనే నిజమేనా? మద్రాసులోని కూరలుతినిన ఏనుగ కాళ్లగుట నిజమేనా? అని అడిగేవారు. నన్ను చూడ వచ్చిన ప్రతివకరును తమకు, తమకు కావలసిన వస్తువులను తలావకరూ ఈసారి వచ్చినప్పుడు తెచ్చిపెట్టమని నన్ను అడిగేవారు. నీళ్ల నిల్వచేసుకొనుటకు పెద్దకొయ్య పీపాయని తెచ్చిపెట్టమని ఒకరు చాలాదూరం ప్రార్థించిరి.

# 7 తొలికాపురపు ముచ్చట్లు

నా వివాహమైన మూడుసంవత్సరములకు నాభార్య యింటికివచ్చెను. అమె వచ్చినవెంటనే మద్రాసులో క్రొత్తకాపురమును పెట్టవలసివచ్చినది. నా బాల్యస్నేహితుడగు అన్నం చెన్నకేశవుల శెట్టిగారికి అచారప్పన్‌వీధిలో యొక యిల్లుండెను. అయింటిలోవారు మమ్ములను కాపురముంచిరి. అన్నివిధముల వారు కనిపెట్టుచుండిరి. వారియింటిలో కొంతకాలముండి మరియొకయింటికి మారితిమి.

నాతోకూడ ఆ ఇంట అరవ బడిపంతులు కాపురముండెను. అపంతులు పేరు వెంకటేశయ్యరు - భార్యపేరు మంగళాంబ. వీరికి యిరువురు బిడ్డలుండిరి. ఈ బడిపంతులుకును నాకును మాసమునకు రు. 20 లు మాత్రమే వరుంబడి యుండెను. మేముండిన యింటిలో యొక భాగమునకు రు. 1-6-0 నెలకు

బాడుగను నేనిచ్చుచుంటిని. మరియొకభాగమునకు అయ్యరు నెలకు రు. 2 లు యిచ్చుచుండిరి. వారిది తంజావూరు ప్రాంతము. మాది వంగోలు ప్రాంతము. నాకుకొద్దిగ అరవము తెలిసినను వంగోలావిడకు అరవభాష అయోమయముగనుండెను. అయితే అరవగృహలక్ష్మి ఆంధ్రగృహలక్ష్మి వద్ద కొలదికాలములోనే తెలుగుభాషను చక్కగ నేర్చుకొని మాతో ధారాళముగ సంభాషించుటకు తయారైనది. తెలుగుగృహలక్ష్మి అరవభాషను వెక్కిరించుటకు తయారైనది. నేను మా ఆవిడను 'అరవమును నేర్చుకొనరాదా' యని హెచ్చరించినపుడు వీదరించుకొనుచుండెడిది.

అరవలు ఆంధ్రదేశమునకు డిప్టీకలెక్టర్లుగను, అయ్యవార్లుగను, లాయర్లుగను, ఇంజనీర్లుగనువచ్చి కొలదికాలములోనే తెలుగుభాషను చక్కగా నేర్చుకొని వ్యవహారములను తెలుగువారికంటె నేర్పుగ నెరవేర్చుకొనుచుండుట తెలుగువారికి తెలిసిన విషయమే. అరవవారిబిడ్డలు తెలుగుబళ్లలో చదువుకొని ఆంధ్రభాషాప్రవీణులయినవారిలో కొందరు నాకు తెలియును. అట్టివారిలో నేడు తెలుగుపత్రికలలో తరుచు వ్యాసములు వ్రాయుచుండు శ్రీరామచంద్ర అగస్త్య యం.ఏ గారున్నూ వారిసోదరియు తెలుగువారికి బాగా పరిచితులు.

మన ఆంధ్రసోదరులు చిరకాలముగ మద్రాసును స్థిరవాసముగ నేర్పరచుకొని స్థిరాస్తులను సంపాదించుకొనియుండినను అరవభాష ధారాళముగ మాట్లాడుటకు అసమర్థులైయున్నారు. ఇందుకు ముఖ్యకారణం అసూయ. తెలుగువారే కొందరు ఆంధ్రరాష్ట్రోద్యమమును వ్యతిరేకించుచుండగా ఆంధ్రదేశంలో (నెల్లూరులో) నివసించుచుండిన అరవవారగు సంతానరామయ్యగారు, అణ్ణాస్వామిఅయ్యరు, టి. వి. వెంకట్రామయ్యరు మున్నగువారు అనుకూలత చూపి ఆంధ్రుల అభిమానమును బడయుచుండిరి.

కేసరి హైస్కూలునందు రాధాకృష్ణశాస్త్రి అను అరవ అయ్యరు తెలుగు పండితులుగనుండి ఇటీవలనే రిటైరు అయినారు. వీరు తెలుగు గ్రంధములను కూడ వ్రాసిరి. ఇటువంటి అరవ తెలుగుపండితులు మద్రాసులో మరి కొందరున్నారు.

నారాయణ మొదలివీధిలో మొదట మేము కాపురముండిన ఇంటివంట ఇండ్లు చాలా చిన్నవైనను, అరవతల్లి మంగళాంబ అమితశుభ్రముగ నుంచుకొను నేర్పరిగ నుండెను. ఆమె ఆ చిన్నవంటగదిని చక్కగచిమ్మి తడిగుడ్డతో తుడిచి ఆ రాతినేలను అద్దమువలె పెట్టుకొనుచుండినది. పానపాత్రలను బూడిదతో తోమి తళతళమని మెరయునట్లుగచేసి వాటిని వంటయింటి

అలమరలో చక్కగబోర్లించి పెట్టుచుండెను. అంట్లతప్పెలనుకూడా ఆమెయే తోముకొని బోర్లించుచుండెడిది. ఇట్లు చేయుటవలన ఆ వంటయిల్లు అలంకారముగ నుండెడిది.

ఆదివారమునాడు అయ్యరు అంగడినుండి బియ్యము, పప్పువగైరా సామానులు తెచ్చినవెంటనే ఇల్లాలు వెలుతురులో కూర్చుండి ఓపికతో రాళ్లు రప్పలను యేరి తీసివేసి మూతలుండు డబ్బాలలోపోసి జాజికాయచెక్కపెట్టెలో పెట్టి భద్రపరచుచుండెడిది. వారి భోజన సామాగ్రినంతయు ఈపెట్టెలోనే యిమిడ్చి పెట్టుకొనుచుండినది. చింతపండును తెప్పించి దానిలోనుండు విత్తులను, ఈనెలను, రాళ్లను తీసివేసి అందులో కొద్దిగ వుప్పునువేసి మెత్తగ దంచి 30 వుండలనుచేసి యెండబెట్టి జాడిలో పెట్టుకొనుచుండినది. ప్రతిదినము ఒకవుండను రాతిమరిగలో నానవేసి ఆ పులుసును అన్నిటికిని వాడుకొనుచుండినది. అంగడి పప్పును ఆదినమునకు కావలసినంత తీసుకొని రాతిచిప్పలోవేసి నీళ్లలో కరగనిచ్చి భోజనపదార్థములలో ఆ వుప్పునీటిని వేయుచుండెడిది. ఇందువలన ఆ వుప్పులోయున్న రాళ్లు మన్ను కడుపులోకి పోకయుండును. నేతిని వీరు వాడరు గనుక నూనెనుమాత్రము తెప్పించి జాడిలోపోసి వాడుకొనుచుండిరి. నూనెలో బెల్లమును వేసినందున నూనె తేటపడును. మజ్జిగకు బదులు సాతీర్థమును (పుల్లనీళ్లు) వాడుకొనుచుండిరి. మోదుగఆకులను తెచ్చుకొని తీరికకాలములో భార్యాభర్తలు కూర్చుని ఎకచకములాడుకొనుచు జానెడు విస్తళ్లను కుట్టుకొని వాడుకొనుచుండిరి.

వారి వంటకు చిన్నమట్టిపొయ్యిని సొగసుగ ఆమెయే వేసుకొనును. పొయ్యిమంట వృధాగాపోకుండ పొయ్యివద్ద కూర్చుండి నేర్పుగ వంటవేయుచు కొద్దిపుల్లలతోనే వంటంతయు చేయుచుండినది. అన్నమునువండు కంచుతప్పెల అడుగున మట్టిపూసి పొయ్యిమీద పెట్టును. ఇందువలన తప్పెలను అరగ తోము పనియుండదు. వీరు స్నానమునకు బావినీళ్లు పానమునకు వేడినీళ్లు వాడుకొనుచుండిరి. ఒకపూటమాత్రమే వీరు వంటచేసుకొనుచుండిరి. సాయంత్రము వంటప్రయత్నములేదు గనుక అయ్యరు బడినుండి వచ్చిన వెంటనే యిరువురు స్నానమునుచేసి అలంకరించుకొని ఇంటిసమీపముననుండు చెన్నకేశవ పెరుమాళ్లసన్నిధికి సరిగా ప్రసాదసమయమునకు బిడ్డలతోకూడా పోవుచుండిరి. ఈ విష్ణువుసన్నిధిలో దినము పులిహోరను, దధ్యోజనమును భక్తులకు పంచిపెట్టుచుండిరి. ఆప్రక్కననే శివాలయముకూడ యుండినను అక్కడికి భక్తులెవరుపోరు. ఏలననగా శివాలయములో ప్రసాదముగాక విభూతి నిచ్చెదరు గనుక.

ఈ మంగళాంబకు ఒడిబిడ్డ, ఎడబిడ్డ యిద్దరు బిడ్డలుండిరి. ఒడిబిడ్డకు డబ్బాపాలకు బదులు రాగులను నానవేసి బండమీద నూరి ఆ రాగులను గుడ్డలో వడియగట్టి కాచి అందులో కొద్దిగ బెల్లమును కలిపి ఆకలెత్తినపుడెల్లను మితముగ యిచ్చుచుండినది. ఈ రాగులపాలవలన ఆ చంటిబిడ్డ రబ్బరు బొమ్మవలె బుసబుసలాడుచు పెరుగుచుండెను. ఈ రహస్యము అరవతల్లులకు తెలియును. ఎడబిడ్డ ఏడ్చినపుడు వరిపేలాలు బెల్లముకలిపిచేసిన బొరుగు వుండలను యిచ్చుచుండినది. ఈ ఆహారమువలన పిల్లవాని ఆరోగ్యముకూడ బాగుంటూవచ్చినది. ఆదివారమునాడు అయ్యరుకు తెల్లగెనుసుగడ్డలను కుమ్ములోపెట్టి ఫలహారము పెట్టుచుండినది. ఈ తెల్లగెనుసుగడ్డలనే నెహ్రూగారు కఱవుకాలమున అందరికి ఆరోగ్యకరమైన ఆహారమని పలుమారు చెప్పుచున్నారు. ఈ రహస్యమును అరవతల్లి ఆకాలముననే గ్రహించినది.

వారికి తెల్లవారగనే కాఫీ, ఫలహారములు అలవాటులేదు. అయ్యర్ తెల్లవారగనే స్నానముచేసి, జుట్టును జారుముడివేసి విభూతిని వళ్లంతయు పూసుకొని వెంటనే వంటయింటిలోకిపోయి రాతిమరిగలో పులియుచున్న పుల్ల నీళ్ల అన్నమును నీళ్లను కడుపార త్రాగి ఉడుపులను తగిలించుకొని పాఠశాలకు పోవును. మరల ఒకగంటకువచ్చి వేడిఅన్నమును తినును.

ఈ అయ్యర్ అయ్యవారికి నెలకు జీతము రు. 20 లు గనుక జీతమును తీసుకొన్న నాడె దోవలోనున్న పోస్టాఫీసుకుపోయి సేవింగ్సుబ్యాంకిలో రు. 5 లు కట్టివచ్చును. మిగత రు. 15 లు యిల్లాలివద్ద తెచ్చియిచ్చును. ఈ పైకముతో మంగళాంబ యింటిఖర్చునంతయు పొదుపుగగడిపి సంవత్సరము నకు రు. 20 లు కూడబెట్టుకొనును. వంటచేసిన పొయ్యిలోని నిప్పును చల్లార్చి ఆ బొగ్గులను కళాయిపూయువారికి అమ్మును. పాతగుడ్డలనిచ్చి పరకకట్టలను కొనును. పాతచీరలలో చించిన సరిగపేటునిచ్చి కంచులోటాలను గాజు టంబ్లర్లను కొనును.

ఈవిధముగ ఆమె సంసారమును జాగ్రత్తగ గడుపుకొనుచు భర్తయిచ్చిన పైకములో మిగుల్చుకొనిన రు. 20లతో కూడ చిల్లరసంపాద్యమును కలిపి దీపావళిపండుగనాడు కొర్నాడు పట్టుచీరెనుకొని కట్టుకొనును. ఆకాలమున పాతికరూపాయలకు మంచి కొర్నాడుచీరె వచ్చుచుండెను.

ఈ అరవతల్లికి భోజనానంతరము నిదురబోవు దురలవాటులేదు. కుట్టుపనినిగాని, చదువుకొనుటగాని, అప్పడాలు వత్తుటగాని ఆమె చేయు చుండును.

చంటిబిడ్డ యేడ్చినపుడు గుడ్డఉయ్యాలలో పరుండబెట్టి జోలపాటలను పాడుచుండును. అప్పుడప్పుడు త్యాగయ్యగారి కృతులను కంఠమెత్తి శ్రవణా నందముగ పాడుచుండినది. భక్తిరసముగల పురందరదాసు కీర్తనలనుకూడ పాడుచుండెను. భర్తయింట నుండిననాడు ఈతల్లిపాటలను నేను వినగోరి నప్పుడు అడ్డుచెప్పక పాడుచుండెను. కావేరి తీరమున పుట్టిన పుణ్యాత్ము లందరు చక్కగ పాడనేర్చినవారె.

మంగళాంబ ఒడ్డుపొడుగుకలిగిన మంచివిగ్రహము. తెల్లవారగనే స్నానముచేసి కురులను కురచగ దూముడి వేసుకొని పట్టుకోకను కట్టుకొని కుంకుమను పెట్టుకొనినప్పుడు మంగళాంబ కామేశ్వరివలె కళకళలాడు చుండెడిది. ఈమెకు పరిశుభ్రతయే మంచిమడి, ఆచారము.

మంగళాంబ ప్రతిదినము తెల్లవారగనే చన్నీళ్లస్నానమును చేయుట వల్లను అభ్యంజనమునాడు తలకు చీకిరేణిపొడిని వాడుటవల్లను ఆమె కురులు నున్నగను నల్లగను పట్టుకుచ్చువలె నుండెడివి. చన్నీళ్లస్నానమువలన మన మెదడు చల్లబడి కురులు పొడవుగ పెరుగును. కావేరీ తీరవాసులకును, మలబారువారికిని తెల్లవారగనే శీతలోదకమున స్నానముచేయు అలవాటుగలదు. మలబారువారు తలకు బెండాకును రుద్దుకొనెదరు. చీకిరేణి పొడిలోను, బెండాకులోను జిగురుపదార్థముండుటవలన వెంట్రుకలు బిరుసుగనుండవు.

వంగోలుప్రాంతమున తలంటుస్నానమునాడు సాధారణముగ కుంకుడు కాయల నురుగుతో తల రుద్దుకొనెదరు. కుంకుడుకాయలనురుగు అత్యుష్ణము గనుక తల వెంట్రుకలు వరిగడ్డివలె గరగరలాడుచుండును. తలవెంట్రుకలు చిట్లిపోయి కురచబడును.

తలకు చల్లనీళ్లను వంటికి వేడినీళ్లను వాడుకొనుట మంచిది. కొందరు తలలోని పేలు ఈపి నశించిపోవుటకు మసిలెడునీళ్లను పోసెదరు. ఇందు వలన కొందరు సొమ్మసిల్లి మూర్ఛపోవుటకూడ తటస్థించును.

నదీప్రాంతములలో నివసించువారు నల్ల రేగడమన్నుతో కొందరు తలను రుద్దుకొను అలవాటుగలదు. ఇది చాల మంచిఅలవాటు. ఇప్పుడిప్పుడే పాశ్చాత్యపుస్త్రీలు ఈ రహస్యమును గ్రహించి వాడుచున్నారు.

## తెలుగాబిడ తికమకలు

ఇక మా తెలుగాబిడ సంగతి వ్రాసెదను. ఈబిడ వంగవోలు ప్రాంతమునుండి వచ్చినది గనుక ఆ పల్లెటూరి ఆచారము ననుసరించి తన

వంటయింటిలో ప్రతిదినము మట్టి పేడతో మెత్తి అలుకుచుండినది. ఇందు వలన వంటయింటిలో కాలుపెట్టిన దిగబడుచుండెను. ఈమె వంటయింటి నిండుగ ముగ్గులు వేయుచుండెను. మాయిరువురి వంటకు నాలుగు రాతి పొయ్యిలను కూలిచ్చి వేయించినది. మాసమునకు కావలసిన కట్టెలను పిడకలను ఒకేతడవ తెప్పించి పొయ్యిల ప్రక్కనే పేర్చిపెట్టినది. భోజన సామగ్రిని వుంచుకొనుటకు కొన్నికుండలను తెప్పించి వంటయింటి దక్షిణపు తట్టు కుదుళ్లమీద వరుసగా పెట్టినది. ఒకమూల గంజిగుంటను, మరి యొకమూల దాలిగుంటను యేర్పాటు చేయించినది.

వంటయింటినిండుగ వుట్లను వ్రేలాడగట్టించినది. అగదినిండుగ పల్లెటూరు పాత్ర సామానును - అనగ నిలువుచెంబులు, బుడ్డిచెంబులు, దోస కాయచెంబులు, జోడితప్పెల, దబరాగిన్నె మొదలగువాటిని పరచిపెట్టివుంచును రాతిచిప్పలు కూడ వుండును. వంట త్వరలోచేయుటకు నాలుగుపొయ్యిలను ఒకేసారి బుడ్డికిరసన్‌నూనెతో ముట్టించును.

మాయింటిలో, వేయించిన కందిపప్పే వాడుక; గనుక ప్రతిదినము ముద్దపప్పు, లొడ్డుపులుసు, వేపుడుకూరలు, రెండుపచ్చళ్లు, పండుమిరపకాయల కారము ఉండితీర వలయును. రాత్రిళ్ల అన్నములోకి పప్పుపొడి, గోంగూర, చింతకాయ పచ్చళ్లు, చిక్కటి మజ్జిగ ఉండవలయును. ప్రతిశుక్రవారము అమ్మణ్ణికి నేతిగారెలను నైవేద్యము పెట్టుచుండినది. పిండివంటల నోమును పట్టుచుండినది. నోము వుద్యాపనకు గారెలను బూరెలను నేతిలోచేసి బుట్ట నిండుగపెట్టి ముత్తైదువకు వాయన మిచ్చుచుండెడిది. శనివారం వెంకటేశ్వరు నకు చలిమిడిపిండి, నేతిదీపారాధన చేయుచుండెను. వ్రతమునకు వండిన నేతిగారెను ఒక్కటైనను నా కివ్వమని ఆశపడి అడిగినప్పుడు వ్రతమునకు చేసినవాటినిచ్చిన వ్రతభంగము కల్గునని నిర్దాక్షిణ్యముగ నిరాకరించెడిది.

వరలక్ష్మీవ్రతమునాడు మంగళాంబను భోజనమునకు పిలుచును. అప్పు డామె - నాభర్తను విడిచిపెట్టి నేను విందుభోజనముచేయుట వీలుగాదని చెప్పును. అప్పుడు నేను అయ్యర్‌ను కూడ భోజనమునకు రమ్మనెదను. ఆనాడు ఆ కుటుంబమంతము మాయింటనే భుజింతురు.

మేము కూరలకు నూనెవాడిన తలతిరుగును గనుక అన్నిటికి నేతినే వాడుచుంటిమి. ఈ కారణములవల్ల నా నెలజీతము నేతికి కూడ చాల కుండెను. ఆ కాలమున మంచి నేతిని వీశ రు. 1-4-0 కు అమ్ముచుండిరి.

ఒక వైద్యుడు కాకరకాయలో క్వయినాగలదు గనుక దినము తినుచుండిన మలేరియాజ్వరము రాకుండుటయేగాక మంచి ఆరోగ్యముకూడ కలుగునని చెప్పినందున నేను ప్రతిదినము కొత్వాలు చావిడి మార్కెట్టుకు పోయి, మంచి పెద్దకాకరకాయలను తెచ్చుచుంటిని. ముళ్లవంకాయలు చిన్నని కర్పూరపువంకాయలు రుచికరముగ నుండునుగనుక వాటిని తెచ్చుచుంటిని దేశవాళి గోంగూర కనబడిన విడుచువాడనుగాను. ఒంగోలువారికి పచ్చళ్లలో కూడా పచ్చిమిరపకాయలను కొరుకుకొనుట అలవాటున్నందున వాటిని తెచ్చుచుంటిని. పచ్చిమిరపకాయలో మంచివిటమిన్ వున్నట్లు నవీనవైద్యవేత్తలు గనుగొనిరి. అందువలననే గుంటూరుగడ్డలో పుట్టినవారి దేహదార్ఢ్యమునకు ముఖ్యకారణము పచ్చిమిరపకాయలనియే చెప్పవచ్చును.

మా అబిడ మద్రాసుకు వచ్చునపుడు నేను పెండ్లినాడు పెట్టిన రోజా రంగు బనారసు సరిగచీరను, బాలామణిచీర, చిలుకపచ్చ సాదాపట్టుచీరెలను, తల్లిగారు పెట్టిన ముదురు లేత చుట్టుచంగాయిచీరెను, కోటకొమ్మంచు వేసిన తెల్లచీరెను తనతోకూడ తెచ్చుకొనెను. మద్రాసుకు వచ్చిన పిమ్మట మూడు చుక్కల మధురచీరెలు, బందరుచాయ గువ్వ కన్నుచీరెను, సాదారంగుచీరెలను నేను కొనియిచ్చితిని. వర్షాకాలమున మడికట్టుకొనుటకు నారమడిచీరెను పెండ్లిండ్లకు కట్టుకొని భోజనమునకు పోవుటకు బరంపురం వంగపండుచాయ పట్టుతాపితాను కొని యిచ్చితిని.

తెలుగుతల్లికి తన చీరలను తాను వుతుక్కొని అరవేసుకొను అలవాటు లేదు ; గనుక పనిమనిషి వద్ద యిచ్చి వుతకమనుచుండినది. ఆ చీరెలను పని మనిషి పేడలోను మట్టిలోను పొర్లించి రాతిమీద వుతుకునపుడు రాతికి చొక్కెనకు తగులుకొని చీరెలు చినుగుచుండినవి. పట్టు చీరెలను కట్టుకొని విందు భోజనములకు పోయి నేతి చేతులను కట్టుకొన్న చీరకు తుడుచుకొని యింటికి వచ్చి ఆ చీరను మడిచి యొకమూలను పెట్టుచుండినది. చేతులు తుడిచిన నేతి వాసనకు రాత్రిళ్లు యెలుకలు వచ్చి ఆ చీరను వెయిగండ్ల చీరను చేసి పోవుచుండెడివి. ఆ చినిగిన చీరెను సుమంగళి కట్టుకొనిన దరిద్రము వచ్చునని పనివార్లకు పంచి పెట్టుచుండినది. అప్పుడప్పుడు పాత చీరలను యిచ్చి సూదులకు, మాయపగడాల దండలను కొనుచుండినది. ఇందువలన తెలుగుతల్లికి యెప్పుడు గుడ్డలకు కఱవుగనేయుండును. చీరె యెండలో ఆరిన గాని మడికి పనికిరాదని ఈమె వాదించుచుండును. కనుక ఈమె పట్టు చీరలను మిద్దెమీద యెండ వేయుట వలన రంగు పట్టు చీరలన్నియు తెల్లపట్టు తావుతాలగుచుండినవి. తెలుగుతల్లికి అరవ తల్లికివలె క్లుప్తంగా వంట వేసు కొనుట తెలియదు. మాకు వండిన వంటకములు మరి ముగ్గురకు కూడా

సరిపోవుచుండెను. మిగిలిన అన్నముతో పనిమనిషి సంసారమును, పంది కొక్కుల సంసారమును కాపాడుచుండెను. ఈమె వంగవోలు వంట చాలా రుచిగాను పరిశుభ్రముగను చేయుచుండినది. ఆమె పోయిన పిమ్మట నాకు అటువంటి వంట కఱవైనది.

మా వంగవోలాబిడకు చదువు సున్న, కుట్టుపని రాదు, అప్పడము లొత్తుట అసలే తెలియదు. కనుక ఈమె భోజనానంతరము కొంగు పరచు కొని సుఖ నిద్రననుభవించుచుండెను.

అయితే ఈమె అప్పుడప్పుడు వంటచేయునపుడు, పచ్చళ్లను నూరు నపుడు తల్లివద్ద నేర్చుకొనివచ్చిన లక్ష్మణమూర్ఛ, శీతమ్మ కడగండ్లు, కుశలవ కుచ్చలకథ, పాముపాట మొదలగు పాతపాటలను పాడుకొను చుండును. మడికట్టుకొని లక్షవత్తుల నోమునకు కావలసిన జడపత్తివత్తులను చేసుకొనుచుండును. జపమునకు కొనుక్కొనిన పగడాల తావళమును త్రిప్పు చుండును. మంగళాంబ అప్పుడప్పుడు త్యాగయ్య కీర్తనలను పాడుచుండిన చీదరించుకొనుచుండును. సంసార స్త్రీ సంగీతమును పాడగూడదట. ఇదియే కావేరితీరమునపుట్టిన అరవతల్లికి, గుళ్లకమ్మవడ్డున పుట్టిన తెలుగుతల్లికి భేదము.

మంగళాంబను చూచి అయినను నీవు మంచిమార్గములను నేర్చుకొన రాదాయని నేను అదలించి కోపించినప్పుడు - 'ఆ దరిద్రురాలిని చూచి నేను నేర్చుకొను విద్య లేమున్న'వని జవాబు చెప్పుచు కంటనీరు కార్చుచుండినది. ఎండకాలమున వడపెట్టు తగలకుండగను వడగడ్డలు రాకుండగను అంగారక గ్రహదోషనివారణకు మాయింటి పురోహితుడు కడప సుబ్బయ్యశాస్త్రికి కంది పప్పును, ఉర్లగడ్డలను ధానమిచ్చుచుండినది. ఫలాని ఋతువులో ఫలాని దానము లివ్వవలయునని పురోహితుడువచ్చి ఈ అమాయకురాలితో చెప్పి పోవుచుండును. ఆ పురోహితుడు నేను సమకాలికులము. ఇప్పుడుకూడ అప్పుడప్పుడు పండుగలకువచ్చి ఆ చనిపోయిన మహాతల్లిని స్మరించి చేతులెత్తి నమస్కరించి పోవుచుండును.

మేము కాపురముండిన యింటిలో కొళాయిలేనందున ప్రక్కయింటి కోమట్ల కొళాయిలో మంచినీళ్లను తెచ్చుకొనుచుంటిమి. ఆయింటి శెట్టి దరిశా రంగనాధమును, నేనును స్కూలులో చదువుకొనిన పరిచయముండినది. నా భార్య వారింటికి మంచినీళ్లకు పోయినప్పుడు ఆడవారు ఈమెకు పరిచయమైరి ఒకనాడు ఈమె వారింటికి పోయినప్పుడు "మీ పేరేమమ్మ" యని వారడిగిరి.

అప్పుడు ఈమె తనపేరు "రేపల్లె" యని జవాబు చెప్పెను. ఈపేరు మద్రాసువారికి క్రొత్తగనుండుటవలన వారు ఫక్కున నవ్వి "యిదేంపేరమ్మా" యని పరిహాసమునుచేసిరి. అప్పుడు శెట్టెమ్మను మీ పేరేమని మా ఆబిడ అడిగెను. తన పేరు కనకమ్మయని శెట్టెమ్మ చెప్పుకొనెను. ఆనాటినుండి నా భార్యకూడ కనకమ్మ అనియే పేరు పెట్టుకొనినది. మద్రాసులో అందరు ఆమెను కనకమ్మ అనియే పిలుచుచుండిరి. అయితే పుట్టింటికిపోయినప్పుడు మాత్రము నామకరణమునాడు పెట్టిన రేపల్లె పేరుతోనే పిలుచుచుండిరి. నేనను ఈమెను కనకం అని తిన్నగా పిలుచుచుంటిని. కాని, భర్త భార్యను పేరుపెట్టి పిలుచుట దోషమని ఈమెకు యిష్టములేకుండెను.

సాధారణముగ మద్రాసులో కోమట్లు భార్యను "యెవరాడా" అని పిలుచుచుందురు. ఓసే, ఓసి ఏమె, ఎక్కడున్నావు, ఆబిడ, ఆఁ, ఊఁ, అను మొదలగు సంకేత నామములతో మరికొందరు పిలుచుచుందురు. కొందరు బుద్ధిమంతులు ఏమమ్మోయియని అమ్మయని పిలుతురు. భార్యలు భర్తలను పిలుచునపుడు శెట్టిగారని, అయ్యరుఅని, పంతులని, ఏమండి అని, నాయుడని, మొదలియారని గౌరవనామములతో పిలిచెదరు. అయితే కొందరు స్త్రీలు భర్తపేరడిగినప్పుడు మా ప్రక్కయింటి క్రిష్ణవేణమ్మ భర్తపేరే మా ఆయన పేరుకూడ యని చెప్పెదరు. పేరు చెప్పకూడదనే ఆచారము యెందుకు వచ్చినదో తెలియదు. పెండ్లినాడు పేర్లు చెప్పుకొను ఆచారముయొక్క అర్థమును మనవారికి తెలియకున్నది. ఆనాటినుండి మనము ఒకరినొకరు పేర్లతో పిలుచుకొనవలయుననే అర్థము. కొందరు భార్యను పేరుతో పిలుచుచున్నారుగాని భర్తను పేరుతో పిలుచుట లేదు. కొందరు చదువుకున్నవారు భర్త పేరు కాగితముమీద వ్రాసి చూపించెదరు.

నా గృహలక్ష్మి శుద్ధ అమాయకురాలు. పాతకాలపు పల్లెటూరి భాగ్యశాలి. ఈ తెలుగుతల్లి చాలా భయస్థురాలు. రాత్రిళ్లు యింటిలో పిల్లులు చప్పుడు చేసినప్పుడు దొంగలు వచ్చిరని జెప్పును. మా యింటి ప్రక్కయింటి దొడ్డిలో వున్న పెద్ద రావిచెట్టు రాత్రిపూట గాలికి కదలిన దానిమీద మునీశ్వరుడు (మొగదయ్యము) కూర్చుండి కదిలించుచున్నాడని భయపడుచుండెను. తెల్లవారగనే ఆ మునీశ్వరునకు పాలు పొంగలిపెట్టి మ్రొక్కుచుండును. ఇందువలన మా యింటికి మాంత్రికులు తాంత్రికులు వచ్చి తాయెత్తులను రక్షరేకులను కట్టిపోవుచుందురు. ఈమెమెడ నిండుగ యివి వ్రేలాడుచుండును.

ఈ విధముగ తెనుగుతల్లి సంసారమును సాగించుచుండెను. అయితే ఈ పట్టణములో నాకు వచ్చు స్వల్పవరుంబడిలో ఈ దుబారా సంసారమును

నేనెట్లు గడపగలిగితినాయని పాఠకులు సందేహపడవచ్చును. ఆ కాలమున మద్రాసులో ఇస్త్రిరి చొక్కాయి, తలగుడ్డ ధరించుకొనిన వానికి అంగళ్లలో అప్పు పుట్టుచుండినది.

# 8 నా చిన్ననాటి చెన్నపట్నం

నేను చిన్ననాడిక్కడికి వచ్చినప్పుడు చెన్నపట్నము ఈ స్థితిలో లేదు. నాటికి నేటికి చాలా సం॥లు గడిచినవి. ఎన్నియో మార్పులు నా కండ్ల యెదుటనే జరిగిపోయినవి. కావున నాటి పట్నపుస్థితిగతులు, నా ఎరుకలో జరిగినమార్పులు ఈ కాలమువారికి తెలియతగినవి కావున వివరింతును.

## సముద్రతీరము

ఆ రోజులలో సముద్రమునకు కోటకు మధ్య ఇంతదూరం ఖాళీస్థలము లేదు. సముద్రపు అలల దాదాపు కోటగోడలవరకు వచ్చి కొట్టుకొను చుండేవి. కోటచుట్టు ఉండే అగడ్తలనిండా నీరుండేది. ఇప్పుడు స్వరాజ్య పతాకము ఎగురుచుండు స్తంభముననే అప్పుడు ఆంగ్లేయుల యూనియజాక్ పతాకము ఉండెడిది. కోటయొక్క అన్ని ముఖద్వారములందును యూర పియన్ సిపాయీలు విచ్చుకత్తులతో పహరాలిచ్చేవారు. అప్పుడప్పుడు కోట మైదానమునందు సోల్జర్ల కవాతు జరుగుచుండెడిది. ఈ కవాతును చూచు టకై పురజనులు గుంపులు గుంపులుగా పరుగిడుచుండిరి. నేను వచ్చుటకు కొంచము ముందుగానే 1884 ప్రాంతమున ప్రస్తుతం 'మెరినా' అని పిలువబడు అందమైన 'బీచి' కట్టబడినది. అయితే నాటిరోజులలో పురుషులే తప్ప స్త్రీలు బీచి షికారులకు నిర్భయముగా వెళ్లగలిగేవారు కారు. ఏలననగా అవివాహితులైన యూరపియన్‌లు, చిన్న వయస్సువారు వంటరిగా ఈ దేశమునకై సోల్జర్లగ వచ్చేవారు ; వారిని చూచి మన దేశీయులు జంకే వారు. వారెప్పుడైన జట్టు జట్లుగా పట్నపు వీధులలో తిరుగునప్పుడు నగర వాసులు పలువురు తమ ఇండ్ల వాకిళ్లు మూసికొని లోపల కూర్చుండి ; వారు వెళ్లిపోయిన తర్వాత తీసేవారు.

అప్పుడప్పుడే మద్రాసు హార్బరునుకట్టుట ప్రారంభమైనది. నాడు సముద్రపు ప్రయాణీకులు స్టీమరు నెక్కుటకు నేడున్న సౌకర్యములు లేవు. పాత ఇనుపవారధి నుండి క్రిందనీళ్లలోనికి నిచ్చెనఉండేది. దానిమీది నుంచి

చిన్నలు పెద్దలు గడగడలాడుచు క్రింద నుండు చిన్న బోట్లలోనికి దిగేవారు. ఆబోట్లు అలలతో కొట్టుకొనుచుండగా, కొంతదూరమున నున్న పెద్ద స్టీమరు వద్దకు వెళ్లి దానిలోనికెక్కేవారు. శని ఆదివారములందు బడిపిల్లలము ఆ యినుపవారధిమీదికి షికారు వెళ్లి ఈ తమాషా అంతయుచూచి ఆనందించే వారము. సముద్రుడు అనుగ్రహించి క్రమముగా వెనుకకు జరుగుచు పురజనులకు కాశీస్తళము నిచ్చుచున్నాడు. ఏమో, ఎప్పుడు ఆగ్రహించి మరల ముందుకురుకునో ? అప్పుడేమి మార్పులు కలుగునో ?

## పురపరిశుభ్రత

నేను ఈ పట్టణమునకు వచ్చినప్పుడు ఇక్కడి వీధులు గుంటమిట్టలుగ నుండెను. వర్షముకురిసినప్పుడు వీధులనుండి నీరుపోవుటకు సరియైన సైడు కాలువలు లేవు; అవి పది సం॥ములలో కట్టబడినవి. వాననీరు నడివీధులలో నున్న గుంటలలో నిండెడివి. ఆ నీరు సూర్యరశ్మికే ఆరిపోవలయును. ఆలోపల దోమలు చేరి జుమ్మని తిరుగుచుండెడివి. ఎప్పుడైనా మునిసిపాలిటీ వారు, దోవలను చేసి ఈ వర్షపు నిలువనీటిని అవలపోవుటకు మార్గము చూపే వారు. ఇండ్లలోని మురికినీరు పోవుటకు మునిసిపాలిటీవారు పెద్దకాలువలను నడివీధులలో త్రవ్వించి గారచేయించి పైన నల్లబండలు వేసి మూసేవారు. వానాకాలమున ఈ రోడ్డు అడుగు కాలువలు నీటితో నిండి పైకుబికి రోడ్లంతయు నీటిమయమై తెప్పతిరునాళ్లగా నుండెడిది. ఇండ్లలో ఊడ్చిన చెత్త చెదారము వేయుటకు నాడు వీధులలో కుప్పతొట్లు లేవు. మునిసిపాలిటీవారు కుప్పబండ్లను తీసుకొనివచ్చి, గృహస్థులు వీధులలో పారబోయించు కుప్పలను వానిలోకి ఎత్తుకొనివెళ్లేవారు. ఇండ్లలో ఊడ్చినకుప్పను, మరుగుదొడ్లలోని మలమును కూడ ఒకేబండిలోనే తీసికొని వెళ్లేవారు.

నాకు తెలిసి వీధులలో కిరసనాయిలు దీపములను వెలిగించుట జరుగుచుండెను. ఆ దీపస్తంభములు దూరదూరముగనే యుండెను. దీపములను వెలిగించువారు మునిసిపాలిటీ వారిచ్చిననూనెను పూర్తిగా ఉపయోగించని కారణమున ఆ గుడ్డిదీపములు త్వరగానే ఆరిపోయేవి. పట్నం త్వరగా చీకటి పడుచుండెను. పిదప గ్యాసులైట్లు వచ్చినవి. 1910 వరకున్నూ గ్యాసులైట్లే వెల్గినవి. అప్పుడు ఈ విద్యుచ్ఛక్తి దీపములు వెలిసినవి.

## వంకర తలపాగాలవారు

ఆ కాలమున చెన్నపట్నంలో పాతకాలపు శెట్లు, నాయుళ్లు, మొదలియార్లు మొదలగువారందరు ఒకవిధమగు తలపాగాలను ధరించుచుండిరి.

ఆతలపాగాగుడ్డ జానెడు వెడల్పునుగల్గి సుమారు 30 లేక 40 మూరలపొడవు ఉండెడిది. ఈపాగాలు వివిధరంగులలో యుండును. ఈతలపాగాగుడ్డను ఆకాలమునందు ప్రత్యేకముగ అంగళ్లయందు అమ్ముచుండిరి. ఈ తలపాగాను చుట్టు మనిషి యింటింటివచ్చి తలకు వంకరపాగాను చుట్టి పోవుచుండెను. ఈ వంకరపాగా చుట్టినందుకు వీనికి ఒక అణామొదలు రెండుఅణాల వరకు కూలి ఇవ్వవలెను.

## జేబుదొంగలు, కత్తెరదొంగలు

మద్రాసు సెంట్రలుస్టేషను ప్రక్కనయుండు కూవముకాలువకు కట్టియుండిన వారధివద్ద ఒకడు నిలుచుకొని దోవను పోవువారినిపిలిచి "అదుగో చూడండి ; మనిషి కాలువలో కొట్టుపోవుచున్నాడు" అని చెప్పును. అప్పుడు దోవనుపోవువారందరు ఒకరి వెంబడి ఒకరు అక్కడ గుంపుచేయుదురు. "అదుగో తల ; అదుగోకాలు" అనివాడు చెప్పును. అక్కడ నిలుచున్న వారందరు ఆదృశ్యమును చూచునప్పుడు జేబుదొంగ అక్కడ నిలుచుండిన వారి జేబులోయున్న డబ్బుసంచులను ఫౌంటెన్ పేనాలను సంగ్రహించి గుంపులో కనబడకుండ కాలికి బుద్ధిచెప్పును. ఈ లోపల ఎవరైన కనుక్కొని "దొంగ" అని కేకలు వేయగ, ఈ దొంగయే పరిగెత్తుచు 'దొంగనుపట్టుకొను'డని కేకలు వేయుచుపరుగున యేసందులోనో మాయమగును. ఈలాటివి అనేకరకముల చోరీలు యిప్పుడూ జరుగుచునేయున్నవి.

మద్రాసు సెంట్రల్‌స్టేషనులోను, పర్వదినములలో దేవాలయమున చేరు గుంపులలోను కత్తెరదొంగలు బిడ్డల మెళ్లలో యుండు ఆభరణములను కత్తిరించుకొని పరారి చిత్తగించెదరు. ఇవి ఇప్పుడును జరుగుచునేయున్నవి.

## పగటి దొంగలు

కొన్ని సంవత్సరములకు మునుపు జార్జిటవున్ గోవిందప్ప నాయునివీధిలో పట్టుపగలు కోమట్లయిండ్లలో దొంగలు జొరబడుటకు ప్రారంభించిరి. గోవిందప్పనాయుని వీధిలోయున్న ఇండ్లు ఒకదానికొకటి అనుకొనివుండుటవలన ఒక యింటి మిద్దెమీద నుండి, ఆ వీధినసుండు మిద్దెలన్నిటి మీద సులభముగ నడవవచ్చును. ఇందువలన ఒకచోటపడ్డ దొంగ పక్క యిండ్లకుపోవుచు ఇండ్లలో వంటరిగ నున్న స్త్రీలమెళ్లలో యుండిన నగలను కత్తిరించుకొని పోవుచుండిరి. అప్పటినుండి గోవిందప్పనాయుని వీధిలోనేగాక యితర యిండ్లలో యుండు ముంగిళ్లకు ఇనుపట్టాలపందిళ్లను వేయవలసి వచ్చెను. అప్పటినుండి

మద్రాసులోకట్టు ప్రతియింటి ముంగిలికి ఇనుపపట్టాల బందోబస్తున్నది. ఇప్పుడు మద్రాసులో కిటికీకమ్ములను వూడలాగి దొంగలు యింట ప్రవేశించుచున్నారు. వానసీళ్ల గొట్టములనెక్కి యింట ప్రవేశించి దొంగతనములు చేయుచున్నారు. తలుపుతాళం వేసిన ఇండలోదూరి దోచుకొని పోవుటకూడ విస్తారముగనున్నది. ఈ దోపిళ్లు రాత్రిళ్లేగాక పగలున్నూ జరుగుచున్నవి. ముఖ్యముగా 11-5గం॥ లకు మధ్య జరుగునట. ఇట్టివి జరుగకుండా నౌకర్లను కాపలాయుంచుడనియు, లేనిచో ప్రక్క ఇంటివారితో చెప్పి వెళ్లుడనియు పోలీసు అధికారులు ఉపాయము చెప్పుచున్నారు. ఆఫీసుల ఎదుట, కాఫీ హోటళ్లముందు పెట్టియుండు సైకిళ్లను కూడా హెచ్చుగా దొంగిలించుకొని పోవుచున్నారు. వీనికి తాళము వేసియుంచు డని మద్రాసు పోలీసువారి సలహా. పోలీసు బందొబస్తుకూడ వృద్ధి చేసినామని పోలీసువారు ప్రకటించారు.

## తలంటువారు

ఆ రోజులలో జార్జిటౌనునందు తలంటి స్నానముచేయించు జెట్టివాడొక డుండెను. అతని పేరు రామదాసు. ఇతడు లావుపాటి భారీమనిషి. నల్లగ పోతవిగ్రహమువలె నుండువాడు. నుదుట వెడల్పాటి నామమును ధరించి రామ నామస్మరణజేయుచు వరదముత్తియప్పన్ వీధి (వరదాముత్తియప్ప అనే తెలుగు వైశ్యునిపేర ఈ వీధివెలిసినది. ఇతడు 18-వ శతాబ్దములో నౌకవర్తకుడు. తెలుగులోనే రికార్డులలో దస్కతు చేసియున్నాడు) యందుకూర్చుండి యుండువాడు. అతడువచ్చి తలంటిన, అకాలమున గొప్పగౌరవము. వాడు చక్కగ వళ్లుపట్టి రామదాసు కీర్తనలను శ్రావ్యముగా పాడుచు దరువుతో తలంటేవాడు. ఇతడందరికి సులభముగా దొరికేవాడువాడు. ఇతనికి చార్జీ రు. 0-4-0 మాత్రమే. అరోజులలో తలంటి వళ్లుపట్టు జెట్టీలు అనేకులుండిరి గాని ఈ రామదాసుకుండిన పేరు, గిరాకి వారికిలేదు.

## చెవిలో గుబిలితీయువారు

మరియొకడు చెవిలో గుబిలినితీసి మందువేసిపోయేవాడు. వీడు రెండు చెవులపైనను గుబిలికడ్డీలను, దూదిచుట్టిన పుల్లలను పెట్టుకొని వీధి వీధికి తిరుగుచుండేవాడు. చెవులలో వేయు మందుకూడ వీనివద్దయుండేది. ఇట్టివారిని నేడును మనము చూడవచ్చును. వీరిలో కొందరు రాళ్లనుకూడ తీసి హెచ్చురేటు పుచ్చుకొనువారు. అసలు చెవులలో రాళ్లు ఉండవనియు, వీరే

హస్తలాఘుమున గుబిలి తీయునపుడే చిన్నరాళ్లను చెవులలో వేసి పిదప తీసి చూపుచుందురనియు అందురు.

## మద్రాసు సోమరులు

మద్రాసులో ముందు సోమరివారు అనునొక జట్టుయుండెడిది. పని లేనివారు, పోకిరివారు, తలిదండ్రులులేనివారు, ఇండ్లనుండి వెళ్లకొట్టబడినవారు, వీరందరు యీ సోమరిజట్టులో చేరుచుండిరి. మద్రాసులో పెండ్లిపేరంట ములు జరుగు ఇండ్లకుపోయి పుల్లాకుల (ఎంగిలాకులు)లోని అన్నాదులను తిను చుందురు. వారి వాకిట ముందర గుంపుగచేరి డబ్బుయిచ్చువరకు కేకలు వేయుచుందురు. రాత్రిళ్ల యిండ్లపంచలలోను మూసివేసిన అంగళ్లముందరను పండుకొనెదరు. పట్టణంకోమట్లకు వీరినిచూచిన భయము. కోమట్లు వీర్లకు నెలజీతములిచ్చి తమ యిండ్లముందరను రాత్రిళ్ల పండుకొనునట్లు యేర్పాటు చేసుకొనెదరు. ఈ సోమరులు పెండ్లిపూరేగింపులకు దివిటీలనుపట్టెదరు. వెదురుబద్దలతో, రంగుకాకితములతోను 20 అడుగులపొడవుకల్గిన రాజు రాణిబొమ్మలను భీకరాకారముగ తయారుచేసి లోపలదూరి పూరేగింపుల ముందరపోవుచుందురు. విరోధులుగ నుండువారిని కొట్టుటకు డబ్బిచ్చినచో వార్లను చావకొట్టివచ్చెదరు. వీరలు కల్లుసారాయిని త్రాగకపోయినను గుంపులు గుంపులుగచేరి గంజాయిని త్రాగుచుందురు. వీర్లలో స్త్రీలుకూడగలరు. ఈ తెగ పురుషులందరు మొదటిప్రపంచయుద్ధములో ఖర్చు అయినారు. ఇప్పుడు వారు మద్రాసులో కనబడుటలేదు.

## పాత బిచ్చగాండ్రు

మద్రాసులో నాటినుండి నేటివరకు పలువిధములగు బిచ్చగాండ్రు కన్పించుచున్నారు. వీరిలో న్యాయముగ పరుల దానధర్మములపై తప్పని సరిగా బ్రతకవలసిన దౌర్భాగ్యులేగాక, కృత్రిమ సంపాద్యపరులు పలువు రున్నారు. ఆరోజులలోను మరకాళ్లనుకట్టుకొని బిచ్చమెత్తేవారుండిరి. లక్క బొమ్మలను చేతికితగిలించుకొని ఆడించుచు వినోధంకల్పించి బిచ్చమడిగే ఆడ వారున్నూ తిరిగేవారు. తురకకొజ్జాలనే నపుంసకులు, మద్దెలతాళములతో ఆటపాటల ప్రదర్శించుచు ఇండ్లకువచ్చి బిచ్చమెత్తుకునేవారు. కొజ్జాలనగ తురక లలో మగవారైయుండిన్నీ ఆడవారివలె వేషభాషలననుకరించే యొక విధమగు నపుంసకులు. వీరు నవాబుల అంతఃపురములలో ఘోషాస్త్రీలకు పరిచారకు లుగా నుండెడివారు.

(ఇంకా వుంది

ఏక్‌నాథ్ సమర్పించు

ఏక్‌నాథ్ మూవీ క్రియేషన్స్



# ప్రేమగీతం



నిర్మాత **శ్రీమతి గాలి ఏక్‌నాథ్** దర్శకత్వం **టి.పి.గజేంద్ర** సంగీతం **ఇళయరాజా**



## 1989 జూన్ 24

'లేఖా - ఇది ఒక లేఖా, కాదు ఇది ప్రేమలేఖ' (దాసరి గీతం - బాలు గాత్రం) మోహన్‌బాబు, జయసుధల మీద కమనీయమూ కావ్యశోభితమూ అగు దృశ్య మంజరిలో చిత్రీకరించారు.... 'బెజవాడ కొండెక్కి కూర్చున్న తల్లో - ఊరు వాడ కాలు తోంది దిగి రావె తల్లో' (ఇది కూడా దాసరి రచనే - బాలూ కంఠమే) మైకంలో వున్న మోహన్‌బాబు ఊరేగింపు మధ్యకి వచ్చి, తన వంతుపాట పాడి, కొంతమేర ఊరేగింపుతో నడిచి, ఆ ఊరేగింపు వెళ్లిపోగా వెనక దిగబడిపోతాడు విషణ్ణ వదనంతో .... చిత్రంలోని మిగతా పాటలు కూడా దాసరి నారాయణరావువే .... లక్ష్మీప్రసన్న వారి 'నా మొగుడు నాకే సొంతం' పిక్చర్లోని నాలుగు పాటలూ 'దేవి - శ్రీదేవి' లో చూపారు..... దర్శకత్వం: దాసరి నారాయణరావు, మ్యూజిక్: మహదేవన్ .... నిర్మాత: మోహన్‌బాబు, నిర్వహణ: కృష్ణ, పురుషోత్తం .... 'నా మొగుడు నాకే సొంతం' అనడం ఏదో తెగబడి అన్నట్లు వుంటుంది గాని, తత్కారణంగా ఏర్పడే వాదోపవాదాలు జనాకర్షణకు దారితీస్తాయి. ప్రేక్షకులని ఆకట్టుకొనే పద్ధతులలో అదొకటి. పాటలు చూసినప్పుడు, ఈ పిక్చర్లో 'హిట్' కాగల లక్షణాలన్నీ వున్నాయని అనిపించకమానదు .... పిఆర్ఒ: పసుపులేటి రామారావు.

## ..... 25

సవేరా స్విమ్మింగ్‌పూల్ చేరువన లంచ్ అయాక, 'పల్లవి'లో 'నీరాజనం' పిక్చర్ పాత్రికేయులకి చూపే ముందు నిర్మాత రెండు ముక్కలు చెప్పారు: 'ఈ పిక్చర్ మీద వచ్చే దాంతో హైదరాబాదులో అంజయ్యగారి కాంస్యవిగ్రహ ప్రతిష్టాపన జరిపించాలని నాకోరిక - అందుకు రెండున్నర లక్షలవుతుంది. అక్టోబరు పదెనిమిది నాడు ఆయన వర్ధంతి. ప్రేక్షకులు, పత్రికలు, ప్రజలు యిచ్చే చేయూతతో నా ప్రయత్నం నెరవేరుతుందని అభిలషిస్తున్నాను ... దేశ సమైక్యతా సాధనలో ఈ పిక్చర్ యితోధిక కృషి చేసిందని నిస్సంకోచంగా చెప్పగలను. నాయికా నాయకులలో ఒకరు మళయాళీ, ఒకరు బెంగాలీ. డైరక్టర్ అశోకకుమార్‌ది

ఉత్తర ప్రదేశ్. సాంకేతిక నిపుణులలో ఒకరు ఒరిస్సా, ఒకరు మహారాష్ట్ర, మరొకరు గుజరాతీ .... కళామయ ప్రపంచంలో ప్రాంతీయతలూ, భాషలూ లేవు. అందరూ కళా సరస్వతిని పూజించే వారే! .... 'రెండు హృదయాలు ఒకటై పలికే రాగాన్ని, ఆ రసానుభూతిని, ఆ ప్రేమని ఈ పిక్చర్లో చూపాము. 'అభినందన'ని ఆదరించినట్లే మంచి చిత్రాలను తెలుగు ప్రేక్షకులు ఆదరిస్తారనే నమ్మకం నాకుంది" - అన్నారు ఆర్వి రమణమూర్తి .... పిఆర్ఒ : కేశవరావు.

..... 29

"కార్తిక్, నిరోషాలు ఫారెస్టర్ ఆఫీసరూ పల్లెయువతీ ప్రేమ జంటగా, గజేంద్ర దర్శకత్వంతో, ఇళయరాజా స్వర కల్పనతో తమిళంలో అద్భుత విజయం సాధించిన ఈ చిత్రం, యస్పి, చిత్ర, వాణీజయరామ్‌ల గానంతో, రాజశ్రీ అనువాదంతో 'ప్రేమగీతం'గా త్వరలో విడుదల కానున్నది. తమిళంలో ముప్ఫయివేల కాసెట్లు అమ్ముడు పోయాయి. అటువంటిది తెలుగులో ప్రేక్షకాదరణ పొందడం విషయంలో నాకెటువంటి సందేహమూ లేదు" అన్నారు ఏక్‌నాథ్, తమ డాబా మీద - చల్లబాటు వేళ జరిపినపత్రికా గోష్ఠిలో .... ఆ తర్వాత 'చాణక్య' గురించి చెప్పారు "మళయాళంలో నవోదయా యూనిట్ నవరస నాయకుడు కమలహాసన్‌తో భారీ ఎత్తున నిర్మించిన 'చాణక్య' చిత్రాన్ని, తమిళంలో రాజ్‌కమల్ ఇంటర్నేషనల్ వేయగా, తెలుగులో ఏక్‌నాథ్ మూవీ క్రియేషన్స్‌నిర్మిస్తోంది. "మూడు భాషల్లోను ఒకేతేదీన విడుదల చేయాలని మా సంకల్పం. బొంబాయి తార శైలజ, కమలహాసన్‌కి జోడీగా నటిస్తోంది. 'విచిత్ర సోదరులు' అంత గొప్పగా ఆదరించిన తెలుగువారు ఈ చిత్రాన్ని మెచ్చుకుంటారు" - అన్నారు. - 1965 నుంచీ ఈ సినీ ప్రపంచంతో అనుబంధం వుండి, వీడియో శాఖకు వినూత్న గౌరవమూ గుర్తింపూ తెచ్చిన ఏక్‌నాథ్ .... పిఆర్ఒ : అరునరావు.

..... 30

1981 లో న్యూయార్కులోను, 1982 లో మస్సాచుసెట్స్‌లోను ప్రదర్శన పొంది, 1983 లో పులిట్జర్ ప్రయిజ్ అందుకున్న 'నైట్, మదర్' ('Night, Mother') మార్షా నార్మన్ (Marsha Norman) రచించిన 90 నిముషాల ఏకాంకిక. మొత్తం నాటిక అంతా తల్లీ కూతుళ్ల సంభాషణ, సంఘర్షణ! వారి మధ్య ప్రేమాభిమానాలు లేక కాదు - పుష్కలంగా ఉన్నాయి. అయితే, రెండవ ప్రపంచ యుద్ధానంతరం ఏర్పడ్డ 'స్త్రీ ప్రపంచానికి' ఇది ఒకవిధంగా దర్పణం. భయము, నిస్పృహా, ఒంటరితనము, ఓటమి, రాగబంధమూ, ఆ బంధాన్ని వదుల్చుకోవాలనే తపన, ఒకరినొకరు పట్టుకు దేవులాడుతూనే ఒకరికొకరు అర్థం కాలేకపోవటం, 'నా జీవితం నాది - జీవించడమూ నిర్గ

మించటమూ అనేది నాయిష్టం' అని పిస్టల్‌ని ఆటవస్తువులా చేతిలో పట్టుకు చెప్పే కూతురు మాటలు తల్లిని భయ విహ్వలతలో ముంచడం, ఆ భయంలో తన ఒంటరితనమే తప్ప కూతురి అంతరంగక్షోభ అర్థం గాక పోవడం, **ఇలా యిరువురు స్త్రీల (తల్లీ కూతుళ్లే మళ్లీ) మనోగతులను మనోభావాలను, మనోవేదనలను, తత్పరిణామాన్ని రస** వత్తరంగా చిత్రించే ఈ నాటికని మద్రాసు ప్లేయర్స్' (The Madras Players) అమెరికన్ సెంటర్ ఆడిటోరియమ్‌లో ప్రత్యేకాహ్వానితుల కోసం ప్రదర్శించారు. విఖ్యాతురాలైన నర్గిష్ పటేల్ (Nergish Patel) తల్లి పాత్రను, బోస్టన్‌లోని ఎమర్సన్ కాలేజీ విద్యార్థినిగా (ఆమె అభ్యసిస్తున్నది రంగస్థల నటన), హాలెండ్‌లో ము నెలల పాటు మొలియర్ నాటకాల పీడి ప్రదర్శనలో పాల్గొని, చుట్టం చూపుగా ఇండియా వచ్చిన స్టెఫానీ డెలిజియానిస్ (Stephanie Deligianis) కూతురు పాత్రను ఎంతో చక్కగా పోషించారు. దర్శకత్వం: మిత్రన్ దేవనేశన్ (Mithran Devanesan).

1989 జులై 01

గాంధీగారి పిలుపు విని, దేశ స్వాతంత్ర్య సమరంలోకి వురికి, ఆ

తర్వాత ఆంధ్రకేసరి ప్రకాశంగారి వద్ద ప్రతికారంగంలో ('స్వరాజ్య') శుశ్రూష చేసి, గూడవల్లి రామబ్రహ్మం గురువుగా సినీరంగం ప్రవేశించి, మొట్టమొదటి తెలుగు ఫిలిమ్ జర్నలిస్ట్‌గా 'గుస గుసలకు' (గాసిప్) గాక ఉత్తమాభిరుచులకు విలువనిచ్చి, ఆదర్శప్రాయమగు సినీ టెక్నీషియన్స్ అసోసియేషన్‌కి మూల విరాట్టయి, దక్షిణభారత ఫిలిమ్ చరిత్రకారునిగా డాక్టరేట్ పొంది, ఎనభై ఒకటిలో అడుగిడుతున్న ఇంటూరి వెంకటేశ్వర రావుకి, రాళ్లబండి కామేశ్వరరావు కార్యదర్శిగా గల ప్రోగ్రెసివ్ ఫిలిమ్ సర్కిల్‌వారు (The Progressive Film Circle, 40, Ranganathan Street, Madras - 600017 Ph 440580) ఫిలిమ్ ఛాంబర్ ఆడిటోరియమ్‌లో సన్మానం జరిపారు. ఈ సందర్భంగా, ఆంధ్రప్రభుత్వ బంగారు నంది బహుమతి పొందిన 'కథానాయిక మొల్ల' (ఇంటూరి స్క్రిప్ట్) చిత్రాన్ని ప్రదర్శించారు. కొంచెం ఆలస్యంగా వచ్చేవారు, ఫంక్షన్‌లో పాల్గొనేందుకు గాను పిక్చర్, ఇంటర్వెల్‌లో, సన్మానోత్సవం జరిపారు .... ఆహ్వాన పత్రంలో పేర్కొన్న డివియస్ రాజు, పసల సూర్యచంద్రరావు, గుమ్మడి వెంకటేశ్వరరావు, పేకేటి శివరామ్, ఊర్వశి శారద సభకు ఎందువల్లనో రాలేకపోయారు. జగ్గయ్య ఒక్కరు మాత్రం విచ్చేశారు. "ఇంటూరివారి జీవితం ఆదినుంచీ కొన్ని ఆశయాలకు లక్ష్యాలకు కట్టుబడివుంది. సినీ పత్రికా రంగంలో ఆయన శిరోధార్యమైన వరవడి పెట్టారు. గ్లామర్‌కి పై మెరుగులకిగాక, సాంకేతిక విలువలకు, ఉన్నత ప్రేక్షకాభిరుచికీ ప్రాముఖ్యమిచ్చారు. ఆయన రచించిన 'ఎక్స్‌ట్రానటి వెంకాయమ్మ' కనువిప్పు కలిగించే రచన. ఆంధ్రాలో సహస్రచంద్ర దర్శనమనీ యిక్కడ మద్రాసులో శతాభిషేకమనీ అనే ఆ ఉత్సవం కూడా మనం ఇంటూరి వారికి జరుపుతాము" - అన్నారు అధ్యక్షత వహించిన జగ్గయ్య. బియస్సార్, మనసత్యం, సుంకర కనకారావు, మిక్కిలినేని, సన్మాన గ్రహీతని అభినందించారు .... సముచిత రీతిని సమాధానం చెప్పారు ఇంటూరి వెంకటేశ్వరరావు.

..... 07

'ఆనంద తాండవం' రఘురామిరెడ్డి, ప్రేమ చిత్ర బేనరు మీద, 'శృంగారయాత్ర' అనే చిత్రానికి ఈ మధ్యాహ్నం రెండు గంటలవేళ, 'కోదండపాణి ఆడియో లాబ్'లో పూజాముహూర్తం జరిపించారు. వైద్యనాథన్ సంగీతం, మధు అంబోటి కెమెరావర్క్. మాటలు - పాటలు : బికె ఈశ్వర్ .... ఇరవై రెండేళ్ల వయసుగల కథానాయకుడు, ఇరువురు అమ్మాయిలలో (ఒకరు జర్నలిస్ట్, మరొకరు ఫిలిమ్‌తార) ఎవరిని నిర్ణయించుకోవడమో తెలియక, త వలపు తీగెల మధ్య ఊగిసలాడటం యిందులోని ప్రధాన కథాంశం. పేరుకి

'శృంగారయాత్రే' గాని యిది సెక్స్ చిత్రం కాదనీ, సామాజిక యితివృత్త మనీ, జులై పధ్నాలుగున ప్రారంభించి, ఒకే షెడ్యూల్‌లో పూర్తి చేయనున్నామనీ, దీపావళి నాటికి విడుదల చేయాలనుకుంటున్నామనీ తెలిపారు దర్శకులు రఘురామిరెడ్డి .... 'ఊహలలో కోరికలు, చేరువలో చెలికాడు .... రా .... రా .... రా అని పిలిచాడు, రానని .... రాలేనని .... పలికాను' (గీతం : ఈశ్వర్ .... గాత్రం : జానకి) - ఈ మొదటి పాటని కథానాయిక 'గీతాంజలి' గిరిజ పై చిత్రీకరిస్తారు. 'వైశాలి' లోని ఋష్యశృంగుడు 'సంజయ్ మిత్ర' ఈ చిత్రంలో హీరో, కొత్త నటి 'రచన' పరిచయమవుతోంది, వేలు, చారుహాసన్ మున్నగువారున్నారు. గుంటూరు, కృష్ణా, పశ్చిమ గోదావరిజిల్లాల హక్కుదారుల ; అవుల శ్రీనాథ్ .... ప్రొడ్యూసర్ : శరణ్యారెడ్డి.

..... 11

"ఉత్తరప్రదేశ్‌లోని ఆ గ్రామానికి వెళ్లి, అక్కడి పరిస్థితులు స్వయంగా చూసి తెలుసుకోవాలనే సదుద్దేశ్యంతో రచయితల బృందమొకటి ఢిల్లీ నుంచి బయలుదేరింది. అక్కడున్న 'ఎజిఐ' సభ్యులొకరికి, మా రాక తెలియ బరుస్తూ, ఆ గ్రామప్రజలమధ్య కలిసి జీవించగల ఏర్పాటు చేయమని కోరాము. 47 డిగ్రీల ఈ నడివేసవిలో గ్రామస్థుల ఇళ్లలో మీరెలా ఉండగలుగుతారని ఎసి రూమ్స్ ఏర్పాటు చేశారాయన - ఆర్మీనుంచి రిటైరైన ఉన్నతోద్యోగి ఆ 'ఎజిఐ' సభ్యుడు. కార్లలోవెళ్లి, ఒకగంటసేపు ప్రశ్నలువేసి వచ్చినంత మాత్రాన, గ్రామీణ జీవనవిధానం, వారి మనోభిప్రాయాలూ కష్టసుఖాలూ మనకేం తెలుస్తాయి ? 75 శాతం భారత ప్రజ గ్రామసీమల్లోనేకదా ఉంటున్నది. ఈదూరం తగ్గించడం ద్వారానే మన సాహిత్యానికి పుష్టినివ్వగలుగుతాము" - అన్నారు. అదర్స్‌గిల్డ్ ఆఫ్ ఇండియా, సెక్రటరీ - జనరల్ రాజేంద్ర అవస్తి, ఈ మధ్యాహ్నం 'రాజాజీ లైబ్రరీ' లో 'ఎజిఐ' మద్రాసు సభ్యులను కలుసుకున్న సందర్భంగా ! కొత్తమంగళం లక్ష్మీశ్రీనివాసన్ ఎగ్జిక్యూటివ్ ఎడిటర్‌గా, జెపి బిల్డర్స్ పరమానందం ప్రారంభించిన కొత్త తమిళపత్రిక 'తార' (పదిరోజులకొకసారి వెలువడుతుంది) రిలీజ్ ఫంక్షన్‌కి ఢిల్లీనుంచి వచ్చారు రాజేంద్ర అవస్తి - ఆయన హిందీలో పేరెన్నికగల రచయిత, ప్రముఖ పత్రికా సంపాదకుడు. స్థానికసభ్యులతో ఇష్టాగోష్టి, లంచ్ ఏర్పాటు చేశారు - మద్రాసు చాప్టర్ కన్వీనరు యస్‌వియస్. "దేశసమగ్రతకు, సమైక్యతకు తోడ్పడగలిగినది సాహిత్యమొక్కటే ! భాషలమధ్య, రాష్ట్రాల మధ్య, ఉత్తరదక్షిణాల మధ్య, తూర్పు పడమరలమధ్య సాహిత్యసేతువుని నిర్మించవలసిన అవశ్యకత ఎంతైనా ఉంది. మన దేశంలోని ప్రతిఊరూ 'మినీఇండియా'

లాంటిది. ఉత్తరాది సాహితీకారుల గురించి మనమెలా తెలుసుకుంటున్నామో, దాక్షిణాత్య సాహిత్య సౌరభం తెలుసుకోవలసిన బాధ్యత హిందీబెల్ట్‌కి ఉంది. ఇది పరస్పరం ఇచ్చిపుచ్చుకోవడంలా జరిగి, ఒకనాడు మతం ఎలా 'సిమెంటింగ్‌ఫోర్స్' అయిందో, ఈనాడు 'సాహిత్యం' ఆ మాదిరిగా ఐక్యతా లక్ష్యాన్ని సాధించాలి" - అన్నారు. 'ఎజిఐ' కి మద్రాసులో జీవస్పందనలా నిలిచిన యస్‌వియస్, - రాజేంద్ర అవస్తికి స్వాగతం తెలుపుతూ ! ఇవ్వాళ యిక్కడికొచ్చిన ప్రతి ఒక్కరూ రచనా వ్యాసంగంలో సుప్రసిద్ధులే .... 'Great Literature is simple language charged with meaning to the utmost degree' - అన్నాడు ఎజ్రాపౌండ్. ('సామాన్యమైన మాటలతో అత్యధిక అర్థవంతంగా చెప్పగలిగేదే ఉత్తమ సాహిత్యం') వేర్వేరు భాషలలో చెబుతున్నా ఇండియన్ లిటరేచర్ మొత్తానికి ఒకటే - అని మనకి అంతర్యంలో తెలిసినా, దానికి క్రియా రూపమివ్వాలి. వెనుకటి గొప్పలతో తలమునకలవడం గాకుండా, వర్తమానానికి సముచిత విలువ నిచ్చి, భవిష్యత్తులోకి చూడగలగాలి.

. . . . . 12

మద్రాసు తెలుగు అకాడమీవారు, 'వియస్‌టి' ఇండస్ట్రీస్ సహకారంతో జులై 21, 22, 23 తేదీలలో మద్రాసు మ్యూజిక్ అకాడమీలో జరుపుతున్న 'స్పిరిట్ ఆఫ్ ఫ్రీడమ్

# ముఖచిత్రం

మన దేశంలోని నలుగురు మహాపురుషుల పేర్లు చెప్పమంటే, గాంధీజీ, టాగూర్, అరవిందుల తర్వాత వచ్చేది రాధాకృష్ణనే. ఇండియన్ ఫిలాసఫీని బయట ప్రపంచానికి బోధపరిచిన అద్వితీయ ప్రతిభాశాలి గనుకనే, బెట్రాండ్ రసెల్ ఆయనని, హైందవ సంస్కృతీ పరిమళాలను విశ్వవ్యాపితం చేసిన మేధావిగా మెచ్చుకున్నారు. 1888 సెప్టెంబరు 5వ తేదీన, తిరుత్తణిలో అతి సామాన్యమైన కుటుంబంలో జన్మించారాయన. అంతర్వీక్షణ, స్వయం కృషి తనని అన్వేషకునిగా చేశాయనీ, వివేకానందుని ప్రబోధం తననిమన ప్రాచీన వారసత్వం వైపుగా మళ్లించిందనీ, ప్రచార-విచారఅచారాల మధ్య నుండే బంధమే, ఆ ముప్పేట ప్రసాదించగల పూర్ణత్వమే, జీవయాత్రకు సొగసు, సౌకుమార్యమూ, శాంతి సామరస్యాలూ చేకూరుస్తుందనీ - అంటారాయన. 1921 లో అస్‌తోష్ ముఖర్జీ, ఈ పేద ఫిలాసఫీ ప్రొఫెసరులోని విద్యా ప్రౌఢిమ గుర్తించి, కలకత్తా యూనివర్సిటీకి రప్పించిన నాటినుంచి, భారత రాష్ట్రపతిగా పదవీ విరమణ గావించే దాకా, తన స్పిరిట్యుయల్ హ్యూమనిజమ్‌తో, ఈ ఫిలాసఫర్ - స్టేట్స్‌మాన్, స్వతంత్ర భారత చరిత్రను బంగారు పుటలతో నింపారు. ★

కాన్సర్ట్స్' (సంగీతోత్సవం) వివరాలు తెలిపేందుకు, వుడ్లాండ్స్ మినీ ఎసి హాలులో పత్రికాసమావేశం ఏర్పాటు చేశారు టివికె శాస్త్రి .... శ్రోతలను రంజింపజేసే ఈ రాగసుధా రస వాహిని శుక్రవారం (జులై 21) సాయింత్రం బిస్మిల్లాఖాన్ షెహనాయి తో ప్రారంభమవుతుంది. బాలమురళీ కృష్ణ 110వ సంగీతా కాసెట్ ఆరోజు విడుదలవుతుంది .... శనివారంనాటి కార్యక్రమానికి మహారాష్ట్ర గవర్నరు బ్రహ్మానందరెడ్డి ముఖ్యఅతిథి. ఈనాటి బాలమురళి వయోలా అహ్మద్ హుసేన్ ఖాన్ సితార్, గాయత్రి వీణ .... ఆదివారంనాడు టివి శంకరనారాయణన్ గాత్ర కచేరి .... జాతీయ సమైక్యతా లక్ష్యం తో జరుపుతున్న ఈ కార్యక్రమానికి టికెట్లులేవు. సంగీత ప్రియులందరూ వచ్చి ఆలకించవచ్చు. అయితే, ఆహ్వానపత్రం మాత్రం ఖచ్చితంగా ఉండాలి. మద్రాసు తెలుగు అకాడమీ వారికి (25 మొలనీరోడ్, టి. నగర్, మద్రాసు - 17) వ్రాసి, ఇన్విటేషన్ కార్డులు పొందవచ్చు .... మీరిది చదివేనాటికి ఫంక్షన్ అయిపోయి వుంటుంది గనక, ఈసారి జరిగే మద్రాసు తెలుగు అకాడమీ ఫంక్షన్‌కి దినపత్రికలో ప్రోగ్రామ్ గురించిన వార్త వెలువడగానే, కార్డువ్రాసి ఆహ్వానపత్రం తెప్పించుకోండి. సాంస్కృతికరంగంలో టివికె శాస్త్రి గారి వంటి ఆర్గనైజర్, యావద్భారతం లోనూ మరొకరు లేరనడం అతి శయోక్తి కాదు.

—యన్నార్ చందూర్

JAGATI

# Electricals Limited

**Hyderabad - 32.**

*world is now made by BHEL*

General Electric, USA, to manufacture Gas Turbines at its

Turbines upto 40 MW rating in standard frame sizes generally important feature of the technical agreement is the provi - like rotor, combustion chamber and transition piece in high latest designs and will be completely manufactured at BHEL,

have access to and can draw upon General Electric's exper- and running them for over 115 million hours.

a variety of fuels ranging from Natural Gas to Light and

in diverse areas : as drives for compressors in booster station fertiliser, Petrochemical, refinery, oil and other process indus- services, Combined Cycle Plants and co-generation applica-

BEST WORK FOR YOU.

## Electricals Limited

**Hyderabad - 500 032.**
*Siri Fori, New Delhi - 110049.*

# చిత్రజగతి

## సమీక్షలు

### లలితశ్రీ కంబైన్స్ 'నీరాజనం'

జయ (శరణ్య) విజయ్ (విశ్వాస్) ప్రేమామృత ధారలలో పునీతులవుతూ వలపు వెన్నెలలో విహరిస్తూ, ఒకరి కొకరు అంకిత మవుతారు; ఆ అంకిత భావంలోనే, ఆ రాగబంధం లోనే జీవనమధువు వుందని తెలుసు కుంటారు. అయితే, ఈ లౌకిక ప్రపంచం వారి సుమధుర స్వప్నాన్ని చెడగొట్టేదాకా ఊరుకోదు. విజయ్ అన్నగారు (శరత్‌బాబు) 'ప్రేమే జీవితం కారాదు, ప్రేమని నమ్ముకున్నవారు బాగుపడరు' - అని తమ్ముణ్ణి మందలిస్తాడు. జయ తాతగారు (సోమయాజులు), ఆ పసి హృదయాల ప్రేమని ఆమోదిస్తాడు గాని, తన మనుమరాలు ఆడతోడు లేని యింటికి కోడలవటం తన కిష్టం లేదని అంటాడు. విజయ్ అన్నగారు విఫలప్రేమికుడై పెళ్లిచేసుకోలేదు. అతను ప్రేమించిన 'ప్రేమ' (రాజ్యలక్ష్మి), తలిదండ్రుల వొత్తిడివల్ల మరొకర్ని పెళ్లిచేసుకు, ఏడాదిలోపల వితంతువై, అదే ఊళ్లో లెక్చరరుగా పనిచేస్తోంది. ప్రేమకు విజయం చేకూరుస్తానని బింకాలు పలికిన ఈ ప్రేమ, చిత్తుగా ఓడిపోతుంది - జయ మరణిస్తుంది - ఆమె స్థానంలో డాక్టర్ జ్యోతి (శరణ్య) అమెరికా నుంచి దిగి, విజయ్ ..నసికరుగ్మతని కొంతమేరనయం చేయగలుగుతుంది గాని అతనూ తన ప్రియురాలు జయలో కలిసిపోతాడు. అజరామరమగు ప్రేమకు అంకితమైన ఈ చిత్రంలో కథాబలమంతగా లేక పోయినప్పటికీ ఆత్రేయ పాటలు పంచదార చిలకలు. ప్రేక్షకులని ప్రేమోద్యాన వనంలోకి తీసుకు పోతాయి ఫొటోగ్రఫీ, మ్యూజిక్. దర్శకత్వం: అశోక్‌కుమార్. నిర్మాత: ఆర్వి రమణమూర్తి.

### వెంకటేశ్వరా ఆర్ట్స్ 'అశోక చక్రవర్తి'

నాలుగు వేదాలూ అధ్యయనంచేసి, ఆంగ్లవిద్యలో పట్టభద్రుడై, యజ్ఞోప వీతాన్ని పరమపవిత్రంగా కళ్లకద్దు కొనే, వేదం వెంకట అశోక్ (బాలకృష్ణ) ఒక దేవాలయ అర్చకుని (సోమయాజులు) కుమారుడు. మేన మామ (గొల్లపూడి), ఒక మోసగానితో

చేతులుగలిపి పన్నిన కుతంత్రం వల్ల, వీరి ఆస్తి కోర్టుల పాలై చివరికి హైకోర్టు తీర్పు వీరికి వ్యతిరేకమయ్యే పరిస్థితి ఏర్పడుతుంది. సరిగ్గా అదేసమయం లో అక్కగారి సీమంతం కోసం ఈ అశోక్, అరటిగెలలు కొబ్బరికాయలు తమతోటలోనుంచి కొట్టుకురావడం, ఆ తోటవ్యవహారం కోర్టులోఉండటం, మేనమామ కూతురు ఊర్మిళ ఈ అశోక్‌ని ప్రేమించి రహస్యంగా కలుసుకుంటూ వుండటం - వీటితో దుర్మార్గానికే పుట్టిన దుష్టులు, అమ్మ వారి నగలు అపహరించాడనే అభి యోగంతో సబ్ ఇనస్పెక్టర్‌చేత ఈ అశోక్‌ని బావబాదించి, న్యాయానికి కళ్లులేవు గనక, అరునెలలు జైలుకి పంపుతారు (అపహరించినది దుష్టులు - అవి బాంక్‌లాకర్‌లో వీరి ప్లీడరు గారి పేర వున్నాయి). నిర్దోషిఅయిన అశోక్, జైలునుంచి తిరిగివచ్చాక, తండ్రిగారి తిరస్కరణతో, బొంబయి చేరుకు, అబ్దుల్లా ఆశ్రయం పొంది, కరీమ్‌భాయ్‌తో (సత్యనారాయణ) చేతులుకలిపి, స్మగ్లర్ల గాంగ్‌వార్‌లో అశోకచక్రవర్తిఅయి, పోలీసు ఉన్న తాధికారులు ఎలా లంచాలు తీసు కుంటున్నదీ వీడియో తీసి, అది అల్బర్ట్‌కి (రంగనాథ్) ఇచ్చి, సినీహీరో గనక స్వయంగా న్యాయసంస్థాపన, పశ్చాత్తాప ప్రకరణ జరిపించి, చక్రవర్తి అవతారం చాలిస్తాడు. కథ: పరుచూరి బ్రదర్స్. దర్శకత్వం: రవిచంద్ర.

## ఉషా ఆర్ట్స్ వారి 'ధ్రువకుమార్'

నిన్న 'అశోక చక్రవర్తి' ఇవ్వాళ 'ధ్రువకుమార్' చూడటంతో, మొదటి నాలుగు మూడు రీల్సూ ఒకే పోలికని ఉన్నాయనిపించింది. రెండు చిత్రా లకు కథ పరుచూరి బ్రదర్స్‌ది. బొంబయి వాతావరణం, స్మగ్లింగ్ గాంగ్స్ మధ్య నుండే వైరం. అద్భు తాలు సాధించే మూవీ హీరోని ఆ యిరువురూ వలేసి పట్టుకోవడం, ఆ హీరోగారు తన శౌర్య ప్రతాపాలు, సచ్ఛీలత కారణంగా అజేయుడవటం - యివి ప్రధానాంశాలుగా నడిచే యితివృత్తాలు రెండూను! అక్కడ బాలకృష్ణ అయితే, ఇక్కడ వెంకటేష్; అక్కడ దేవాలయ అర్చకునిగా సోమ యాజులైతే, ఇక్కడ నిత్యావసర వస్తువులు అమ్మే షాపు యజమాను రాలు పార్వతమ్మగా శారద .... టక్కరి పనులకి, చెయివాటు తనానికి చిన్నప్పట్నుంచీ అలవాటుకి పడ్డ ధ్రువ కుమార్ (వెంకటేష్), అన్నకి తల్లికి చెల్లెలికి దూరమై, బొంబయి హార్బరు లో ట్రక్ డ్రయివరుగా, అక్కడి మోసాలూ, దగాలూ, దొంగ వ్యాపా రాలూ క్షుణ్ణంగా తెలిసిన వానిగా పరిచయమవుతాడు. అయితే వాటితో అతనికి ప్రారంభంలో ఎటువంటి ప్రమేయం ఉండదు - కండ పుష్టి గల సాహసవీరుడు మాత్రమే! చంప డమో, చావడమో లాటి స్మగ్లింగ్ వ్యాపారంలో యిరుక్కు, బాస్ (సత్య

నారాయణ) నమ్మకం సంపాదించి, ప్రియురాలితో (రజని) డ్యూయట్స్ పాడుతూ, తల్లిని, చివరకు అన్నగారిని రక్షించేందుకు మరికొన్ని సాహసాలుచేసి, తల్లి వడిలో కన్ను మూస్తాడు యాక్షన్ హీరో. కృతక సెంటిమెంటు తప్ప, సహజత్వం లేదు. దర్శకులు : వై. నాగేశ్వరరావు. నిర్మాత అశోక్‌కుమార్.

## సుదర్శన్‌వారి
## 'జయమ్ము నిశ్చయమ్మురా'

పాత్రలు కాస్త పరిచయమయాక, అడుగడుక్కీ మనని నవ్వించడమే, జంధ్యాల చిత్రాలలోని ప్రత్యేకత. ఈ కామెడీ ఎంతో స్వభావ సిద్ధంగా నడుస్తుందే తప్ప ఎక్కడా వెగటుతనం కనిపించదు - అసహజమని అనిపించదు. బుద్ధిమంతురాల్లా శాంత (సుమలత) ప్రేమలూ దోమలూ లేవు, తలిదండ్రులు నిశ్చయించిన వరునికే తల వంచుతాను - అని ముక్కు మీద గుద్దినట్లు చెబుతుంది. ఏభై ప్రేమ పెళ్ళిళ్లు జరిపించి, ప్రేమ పూజారిగా వినుతికెక్కిన రాంబాబు (రాజేంద్రప్రసాద్), తీరా తన విషయం వచ్చేసరికి, ఒక బృహత్పథకం వేయవలసి వస్తుంది - అందుకు సాయంగా నిలబడతాడు స్నేహితుడు సూరి (చంద్రమోహన్). ఇతనిని రౌడీల బారినుంచి కాపాడిన కరాటె వనిత, తల్లి కోరిక తీర్చేందుకు శపథాలు చేయడమే తప్ప, ఈ సూరిని కనికరించదు....రాంబాబు నేర్పుగా కోటలో పాగావేస్తాడు- నాస్తికుడైన శాంత తండ్రి జగన్నాధాన్ని, పరమ భక్తురాలైన శాంత తల్లిని (రాధాకుమారి) మాటలతో మెప్పించి, వారింట్లో మొదట వంటవాడై, తర్వాత పనివాడై, డూప్లికేట్ తలిదండ్రులతో కొంత నాటకం జరిపి, మామగారు పెట్టిన మూడు షరతుల్లో విజయం పొంది, అప్పటికే ద్రవీభూత మనస్కురాలైన శాంతను పాణిగ్రహణం చేసుకుంటాడు. బ్రహ్మానందం క్రికెట్ ఎత్తుకొనే దాకా కోటశ్రీనివాసరావు సినిమాకథ చెబుతాడు. దర్శకత్వం : జంధ్యాల ; నిర్మాత : ప్రసాద్.



The ANDHRA FILM SOCIETY is organising its 13th Film Festival (Competitive) in the capital of India from October 7th to 15th, 1989 at FICCI Auditorium, Mandi House, New Delhi. A total number of twelve movies will be screened. They include Sutradharulu, Hai Hai Nayaka, Geetanjali, Mouna Poratam, Simha Swapnam, State Rowdy, Mugguru Kodukulu, Brahma Patrudu, Murali Krishna... etc. etc. There will be Award Function on 15th Oct 1989.

**NVL NAGARAJU**
*General Secretary*
**L 2/1598, DDA Flats,**
**Kalkaji, New Delhi - 19**





?

"With the entry of Soorphanaka, the story of Ramayana takes an entirely different turn. It was a crucial episode," observed Raghu.

"Yes, you are correct. She approached Rama, not in her true colours but as a bewitching damsel, of course, with her Kama Rupa Vidya," said Raghu's Father.

"No doubt, her advances in the very presence of Seeta, were obnoxious and quite repulsive. But your great Rama despatched her to Lakshmana who in turn cut her nose and ears."

"Oh, Raghu, don't be carried away by that silly popular version. That lustful woman Soorphanaka as she rushed towards Lakshmana to embrace him, he in sheer self-defence took out his sword from the sheath to protect himself from the pollution of that embrace. Soorphanaka in her mad frenzy threw her arms about him and the sword that stood in between them, cut her nose and ears. It was her own making and her own folly but in vengeance she gave a twist," explained Raghu's Father.

---

*Swadharma Swaarajya Sangha (Director : BVSS Muni*
*Beehive Bldgs - 29, Prakasam Road, Madras - 600 103*



గడిచినకథ : కళాతృష్ణ గల జ్యోత్స్న, తన ఇద్దరు పిల్లల్ని భర్తవద్ద వొదిలి వెళ్లిపోయింది. బాధ్యత గల తండ్రిగా ఆ పిల్లల్ని పెంచుతున్నాడు డాక్టరు సారథి. వారింట్లో హౌస్‌కీపర్‌గా పనిచేస్తూ, పిల్లల్ని ప్రేమగా చూసుకుంటోంది జానకి .... .... ఇక చదవండి

రకరకాలుగా తారసపడుతూంటారు. కొన్నికొన్ని సందర్భాలలో - వర్కర్స్ బలవంతంమీద ఇష్టం లేకపోయినా కసాయివాడి మేకలాటి వాళ్ళూ వుంటారు. వాళ్ళ దగ్గరికి కొనిరాబడ్డ అందరినీ క్షుణ్ణంగా పరిశీలించి డిజర్వింగ్ కేసెస్‌ను ఎన్నుకొనే బాధ్యత తనే స్వయంగా తీసుకొన్నాడు సారథి ....

డాక్టరుతో పాటూ మేల్ ఆర్డర్లీ రావడంతో మంచంలో తీసుకుంటున్న వ్య__ని ఎంతమాత్రము చూచుకోలేనని తెగేసి చెప్పాలనుకున్న విషయాన్ని ప్రక్కకు నెట్టి నుంచుంది జానకి.

"ఎలావున్నాడు ? .... కదిలాడా ? .... ఏమైనా మాట్లాడేడా ? ...." ఆదుర్దాగా అడుగుతూంటే .... "ఆ" .... "ఊ" అంటూ ముభావంగా బదులిచ్చింది జానకి.

జానకి కళ్ళల్లోకి చూచి పేషంట్ స్థితి పరీక్షించి "టెంపరేచర్ వచ్చేట్టుంది .... నీవు వెళ్ళి పడుకో, జానకీ .... మేల్ ఆర్డర్లీ చూచుకొంటాడు ...." అంటూ తన గదిలోకి వెళ్ళిపోయాడు సారథి ....

అలసిన శరీరం.... దిండుమీద తలవాల్చగానే నిద్రపట్టేసింది జానకికి.

## 20

ఉదయమే లేచి యథావిధిగా ఇంటి పనులు చూచుకోసాగింది జానకి - మధ్య మధ్య మంచంలో వున్న వ్యక్తి కేసి ఏహ్యమైన చూపులను బరపుతూ.

ఈ దినము అతణ్ణి ఇంట్లో వుంచే పక్షమైతే ససేమిరా ఒప్పుకోకూడదనుకుంది.

పిల్లలిద్దరూ లేచి ముందు గదిలో మంచంలో వున్న రోగిని చూచి "పిన్నీ ....ఎవరు అతడు.... నిద్రపోతున్నాడే .... ఎప్పుడొచ్చాడు ? ...." అంటూ ప్రశ్నల పరంపర సాగించారు.

"బాబూ,.... అతడు ఎవరైతే మనకెందుక్కాని....మీరు తొందరగా తెమలండి. స్కూలుకు టైమౌతుంది... అడ్డమైనవాళ్ళ గురించి ఆరా

ఎందుకు?" ఎంత మనసులో దాచు కుందామన్నా దాగని అక్కసు, మాటల రూపంలో వెలువడుతూనే వుంది.

ఏనాడూ నోరు మెదపని జానకి గొంతులో విసుగు ధ్వనిస్తూంటే చిన్నగా నవ్వుకున్నాడు సారథి

"మరి ఇక్కడే వుంటాడా అతడు? లేపడా?" అడిగింది ఓజ్జి.

"అలాంటివాళ్లు లేవకుండా వుంటేనే మేలు .... భూ భారమన్నా తగ్గుతుంది" తనలో తానే గొణుక్కుంది.

సారథి.... నిన్నటి పేపరు ముందు వేసుక్కూర్చున్నాడు.

ఓ. హెచ్. సి కి వెళ్ళడానికి ఇంకా గంటపైగా సమయం వుంది.

"జానకీ!" పిల్చాడు సారథి.... పేపరు చూస్తూ కాస్సేపు గడిపేశాడు. డ్రెస్ చేసుకోబోతూ, రోగిని పరీక్షించి జానకిని పిల్చాడు.

రెండు మూడు సార్లు పిలిస్తేకానీ జానకి అక్కడికి రాలేదు. ఆవిడ ముఖంలో ప్రసన్నత మాయమైంది. గంభీరంగా తలవంచుకొని నుంచున్న జానకిని రెండు క్షణాలు చూచి.... "జానకీ" అన్నాడు.

మౌనంగా తలెత్తింది.

"అతడికి జ్వరంగా వుంది.... ఇంజక్షన్ చేసి వెళ్తాను. లేస్తే ఈ మాత్రలు, కెప్సూల్స్ ఇవ్వు.... జాగ్రత్తగా కనిపెట్టి వుండు" అన్నాడు.







జానకి ఉలకలేదు పలకలేదు.

ఓ అడుగు జానకి వంక వేసి "వింటున్నావా ?" అన్నాడు.

పమిటను వేలికొసకు మెలిపెట్టు కొంటూ "క్షమించండి" అంది.

"ఏమిటి ?"

"అదే.... అతడికి మందులు మాకులు యిచ్చి కనిపెట్టుకొని వుండ టం.... నేను చేయలేను"

చిన్నగా నవ్వుతూ "ఏం భయంగా వుందా ?.... జ్వరమేకదా.... సాయం త్రానికంతా తగ్గిపోతుంది.... అసలు నీ శుశ్రూషలో మరికాస్త తొందరగా కోలుకుంటాడు"

"నాకేం భయంగాలేదు.... మీ మాట కాదన్నందుకు దయచేసి నన్ను క్షమించండి. కావాలంటే హాస్పిటల్‌కి వచ్చి సాయం చేయమన్నా చేస్తాను కానీ... ఇక్కడ ఇతడికి సేవ చేయ లేను" అంది.

జానకి కళ్ళలో నీటిపొర కదు లాడింది.

సారధి భ్రూకుటి ముడివడింది. సుని శితంగా జానకిని పరికించాడు.

కళ్ళలో కదులాడిన నీటిపొరను దాచుకుందుకు తల మరింత అవనతం చేసుకుంది జానకి.

"ఆల్‌రైట్ జానకీ .... ఏ వ్యక్తినీ నిర్బంధించి పని చేయించడం నా అభి మతం కాదు. నీవు పిహెచ్‌సి రాపని లేదు. ఆయాను పంపిస్తాను" అంటూ తన గదిలోకి వెళ్ళిపోయాడు. అలా అన్నపుడు సారధి గొంతులో ఏటు వంటి భావమూ వ్యక్తం కాలేదు.

సారధి వెళ్ళిపోయాక భయం చుట్టు ముట్టింది. సారధి చెప్పిన మాట కాదని ఆయనకు కోపం తెప్పించలేదు కదా ? .... ఏమనుకున్నారో.... ఎందుకు .... ఏమి అని అయినా తనను అడగ లేదు .... తప్పదు .... పేషెంటును చూచుకో అని కఠినంగా చెప్పినా, లేదా, కోప్పడినా బావుండిపోను .... పరుగెట్టివెళ్ళి దారిలో కలుసుకొని చెప్పిరానా ? .... మనసులోనే గుం జాటన పడిపోయింది జానకి.

పిల్లలకు స్నానం చేయించి బట్ట వేసి తలలు దువ్వి తయారు చేసింది అన్యమనస్కంగానే. నారాయణ పరుగెట్టుకొచ్చాడు.

"ఒరే నారీ !...." పిలిచింది విజ్జి....

"ఊ"

"రాత్రి మా ఇంటికి బూచబ్బా యొచ్చాడు తెలుసా ?"

"ఉత్తదే !" కళ్లు తిప్పాడు నారా యణ.

"కాదు.... నిజంగా.... కావా లంటే ఆ గదిలో వున్నాడు చూడు. ...." రవి చెప్పాడు.

నారాయణ భయం భయంగా "ఆ బూచబ్బాయే ! తలను తెల్లటి పట్టి భలేగా వుంది కదా ?.... ఆ జుట్టు చూడు.... దెయ్యం జుట్టులాగ.... దెయ్యం కాదుకదా ?"

"దెయ్యం ఎట్లా వుంటుందిరా, నారీ ?" రవి అడిగాడు.

"దెయ్యానికి.... మరేమో.... దయ్యానికి కాళ్లు వెనక్కి తిరి గుంటాయి"

(ఇంకా వుంది

